# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

7-13, మార్చి '86
రు. 2-50

విశ్వమానవాళిని
పరితాపంలో
ముంచిన
చాలెంజర్
పతనం!

కొత్త సీరియల్
జునీవీ చరిత్ర
ప్రారంభం!

అమరావతీ క్షేత్రం

# నెస్‌టమ్ బేబి సిరియల్
# ప్రారంభించేందుకు ఆదర్శప్రాయమైనది
# పెరుగుదలకు ఆదర్శప్రాయమైనది

**నెస్‌టమ్, పాలు-పూర్తి పోషక విలువలున్న ఆహారం.**

మీ బాబు, సుమారు 4 నెలలవాడయేసరికి, కావాలి పాలతోపాటు ఘనఆహారం. పాపాయికి తేలిగ్గా జీర్ణమయేటు, ప్రత్యేక శ్రద్ధతో తయారయిన నెస్‌టమ్ బేబి సిరియల్‌ని పెట్టడం ప్రారంభించండి.

ముందుగా మరిగించి పెట్టిన గోరువెచ్చటి పాలతో కలపండి. ఇక, పూర్తి పోషక విలువలున్న ఆహారం సిద్ధమవుతుంది.

పాపాయి ఆరోగ్యంగా, చలాకీగా పెరిగేందుకు తోడ్పడుతుంది.

**నెస్‌టమ్‌తో వివిధవంటలు పాపాయి ఆహారంలో బోలెడన్ని రకాలు**

మీ పాపాయి ఎదుగుతున్న కొద్దీ కొత్త రకాలు రుచి చూపించండి.

ఉడికించిన కూరముక్కలూ, పండ్ల ముక్కలూ, పప్పు-వీటిని నెస్‌టమ్‌తో కలిపి పెట్టండి. బాబు, కుటుంబంలోని వారు తినే ఆహారాన్ని తీసుకోవడం నేర్చుకునేందుకు ఇది తోడ్పడుతుంది.

## నెస్‌టమ్®
## రైస్

**ఇనుము-విటమిన్లతో కూడినది**
**పాలలో కలపండి.**




**ఉచితం**
మీ బాబు, తన ఆహారంలో, కొత్త రుచులను కోరుతాడు అందుకని—మీ ఉచిత నెస్‌టమ్ వంటల పుస్తకం కోసం రాయండి.
నెస్‌టమ్

A/FSL/N/3800 TEL

# జీవితంలో అతి ముఖ్యమైన వస్తువుల విలువ మరెంతో ఎక్కువ



## జపాన్ సాంకేతిక పరిజ్ఞానం ఆల్విన్ రిఫ్రిజిరేటర్లలో చిరకాల దక్షత నేర్పాటు చేసింది.

సాటిలేని నిరంతర సేవ మేటిలేని
పనితనం నిశ్చలమైన నిశబ్దమైన
సమర్థత
అవే కొత్త అల్విన్ 2000
ఎస్ ఎల్ సిరీస్ రిఫ్రిజిరేటర్లు
మీ కోసం జపాన్ వారి సాంకేతిక
పరిజ్ఞానం మరియూ గ్యారంటీతో
లభిస్తున్నాయి
హిటాచీవారి లైసెన్సుతో తయారు
చేయబడిన కంప్రెస్సర్ సాఫీగా
నిశబ్దంగా పనిచేస్తుంది
అత్యుత్తమమైన రోల్‌బాండ్ ఫ్రీజర్
అతి ఎక్కువ చల్లదనాన్ని అతి
తక్కువ వ్యవధిలో ఇస్తుంది

అల్విన్ 10 శాతం తక్కువ
విద్యుచ్ఛక్తి వినియోగిస్తుంది
170 నుండి 250 వోల్ట్స్ విద్యుచ్ఛక్తికి
తగినట్లు తయారుచేయబడినది కనుక
వోల్టేజ్ స్టెబిలైజర్ ఉపయోగించ
నక్కరలేదు
స్వయంగా నీరు తోడివేసుకొనే పద్ధతి
ఉన్నందువలన డీఫ్రాస్టింగ్ మరింత
సులభం
అల్విన్ రిఫ్రిజిరేటర్లు 85 165
300 లీటర్స్ సింగిల్ డోర్
మోడల్స్‌లోను, మరియు 165,
300 380 లీటర్స్ డబుల్‌డోర్
మోడల్స్‌లోను లభిస్తున్నాయి
వివిధ రకాల్లో, సైజుల్లో మీ ఎంపికకోసం
మీకు జీవితాంతం అతి త్వరితమైన
సేవ దేశమంతటావున్న అల్విన్
డీలర్లద్వారా లభిస్తుంది
అందుకోసమే

7 సంవత్సరాలు గ్యారంటి

IS 1476



## ఆల్విన్

2000 ఎస్ ఎల్ రిఫ్రిజిరేటర్లు




హిటాచి వారి నుండి లైసెన్సు పొందినది

HITACHI

## *అన్ని సమయాలకు ఆల్విన్*

అల్విన్ ఏరియా సేల్స్ ఆఫీసులు ఈ దిగున స్థలాలలో వున్నాయి
అహమ్మదాబాద్ బెంగుళూరు భోపాల్ భువనేశ్వర్ బొంబాయి కలకత్తా చండీఘర్ ఢిల్లీ ఎర్నాకులం గౌహతి ఘజియాబాద్ హైదరాబాద్ జైపూర్ కాన్‌పూర్ మద్రాసు పాట్నా విజయవాడ మరియు విశాఖపట్నం

MAA(S) ALN 8A TEL 85

## న్యూఢిల్లీ లేఖ



వేగంగా పని చేసే ప్రభుత్వాన్ని అందిస్తామని మనకి హామి ఇచ్చారు కాని ఎడమ చెయ్యి ఎమి చేస్తున్నది కుడి చేతికి తెలియనంత వేగంగా అది పని చేస్తున్నట్లుగా కనిపిస్తున్నది ఒక రోజు అన్ని వస్తువుల దరలూ వరుసగా పెరుగుతాయి కొద్ది రోజుల తర్వాత అవి మళ్లీ కిందకి దిగుతాయి డెహ్రాడూన్ మాపియా అందుకు వివరించే కారణాలు ఈ ప్రపంచంతో సంబందం లేనివిగా ఉంటాయి ఉంటుంది వారి ప్రవర్తన తామేదో అద్భుతాలు చేసే మర మనుషులలాగా వ్యవహరిస్తారు తాము అందుకోసమే పుట్టినట్లు చట్టాలని చేస్తారు అయితే ఏ మాత్రం వ్యతిరేకత వచ్చినా గడ్డి బొమ్మలలాగా గాలికి కొట్టుకుపోతారు దరల విషయంలో వాళ్లు అలాగే చేసారు కాని ప్రపంచంలో ఎక్కడా వినని విదంగా దాని గురించి అబద్ధాలు చెపుతున్నారు ఆయన చెప్పినదాన్నిబట్టి

# వేగంగా పని చేసే ప్రభుత్వం తీరు!

అందుకు నవ్వాలో ఏడవాలో ఎవరికీ తెలియదు అసలు ప్రభుత్వమే లేదని నా నమ్మకం అన్ని నిర్ణయాలూ నాయకుడికి సన్నిహితంగా ఉండే కొందరు వ్యక్తులు తీసుకుంటారు మంత్రివర్గం కానీ పార్టీ కానీ ప్రజాస్వామ్య పద్ధతిలో పని చెయ్యదు ప్రతి వ్యక్తి బాద్యతని మరొకరిమిదకి నెట్టటంలో తీరిక లేకుండా ఉంటాడు ఆఖరికి ఆర్థికమంత్రి విశ్వనాద్ ప్రతాప్‌సింగ్ కూడా అంతర్జాతీయ ద్రవ్యనిది బిల్లుని శ్రీ వెంకటరామన్ పార్లమెంటులో ప్రస్తావించినప్పుడు దేశాన్ని బాగుచెయ్యటం కోసమే దరలని పెంచుతున్నామన్న అబద్ధపు ప్రకటన చేసారు అంటే జాతికి ఎది మంచిదో దేశంలో ఆయన ఒక్కరికే తెలుసన్నట్లు ఉన్నది అది కొంపలంటుకుపోతున్నట్లు గోల పెడుతున్న మనమంతా బుద్ధి హీనులమని ఆయన బావిస్తున్నట్లున్నది

విశ్వనాద్ ప్రతాప్‌సింగ్‌కి ఆయనలాంటి మరి కొంత మందికి అసలు దేశం అంటే ఎమిటో తెలియదు కాబట్టి జాతికి ఎది మంచిదో కూడా వాళ్లకి తెలియదు వాళ్లు అసలు తమ గురించి తమకే తెలియని స్థితిలో ఉన్నారు పార్టీలో కానీ దేశంలో కానీ వాళ్ళకి పునాది లేదు రాజీవ్‌గాంధికి ఆయన ఆప్తమిత్రులకి కూడా ఇది వర్తిస్తుంది అయినా మానవాతీత వ్యక్తులలాగా చూస్తే శ్రీ సింగ్ తక్షణం రాజీనామా చేసి ఉండవలసింది దరల విషయంలో ఆయన తమ నిర్ణయాన్ని తిరిగి వెనక్కి తీసుకోవాల్సి రావటం ఆయనకి చెంపపెట్టే అయింది

చమురు దరల స్థాయి పెరగటం అన్నది దేశం బరించలేదని శ్రీ సింగ్ అంటున్నారు అసలు అలాంటి దిగుమతులకి అవకాశం కల్పించిన తమ ప్రభుత్వ విదానాలతో తమకి సంబందం లేనట్లు ఆయన మాట్లాడుతున్నారు నడుస్తున్న సంవత్సరంలో చమురుపై విదేశీమారకద్రవ్యం కర్చు రు 1200 కోట్లు పెరిగింది చమురు దిగుమతికి ఇప్పుడు మొత్తం రు 4700 కోట్లు అవుతుంది ఇంత వరకూ అజ్ఞానంలో ఉన్న మన చమురు మంత్రికి ప్రపంచ విపణిలో చమురు దరలు క్రమంగా పడిపోతున్నట్లు తెలిసి ఉండకపోవచ్చు నవంబరు నించి ఇప్పటిదాకా చమురు దర 30 శాతం తగ్గింది పీపా 30 అమెరికా డాలర్ల నించి 20కి పడింది గత ఎడేళ్ళలో ఇంత తక్కువ ఎప్పుడూ లేదు కాని మన చమురు దిగుమతి బిల్లు మాత్రం పెరిగిపోతున్నది అంటే ఎవరో లెక్కలు తారుమారు చేస్తూ ఉండి ఉండాలి గతంలో కూడా ఇలాంటిది జరిగింది కువో చమురు వ్యవహారం సంగతి మనందరికి తెలుసు కాంగ్రెసు (ఐ) రాజకియవాదులు ఒక్కసారిగా యోగులుగా మారిపోయారన్నదానికి కూడా నిదర్శనం ఎక్కడా కనిపించదు. ప్రపంచ చమురు విపణి ఎక్కడా చురుకుగా లేదు చాలా దేశాలలో చమురు దిగుమతికి అయ్యే కర్చు కూడా ఇదివరకటికన్నా బాగా తగ్గింది గతంలో చమురు వెలలు పెరగటం ప్రారంబం అయినప్పటినించి అస్తవ్యస్తమైన ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఇప్పుడు అవి తగ్గటంతో ఆశాజనకంగా ఉన్నది కానీ అదికార ప్రకటనలో మాత్రం దీనికి సంబందించిన విషయాలేవీ లేవు

మరొక ప్రకటనలో దరలు పెంచడం ప్రణాళిక వనరుల అబివృద్ధి కోసమని ప్రభుత్వం అంటున్నది అలాంటిదేమి లేకుండానే ప్రపంచంలో అబివృద్ధి జరుగుతున్నా మన ప్రభుత్వం మాత్రం ఆ విదంగా చెపుతున్నది జపాన్ అబివృద్ధి రేటు ప్రపంచంలో అత్యదికంగా ఉన్నది కానీ ఆ దేశంలో ద్రవ్యోల్బణం చాలా తక్కువగా ఉంది జపాన్ సాదించిన దానిని మనం ఎందుకు చెయ్యలేమో? అందుకు కారణం జపాన్ ప్రపంచ బాంక్ అంతర్జాతీయ ద్రవ్యనిది నిపుణుల సలహాలు తీసుకోదు ఈ నిపుణులంతా మన దేశంలో సెలవులు గడిపినట్లు అదికారం అండన వెచ్చగా విడిది చేసి అనంతరం పన్నులేనటువంటి జీతాలని తీసుకోడానికి వాషింగ్‌టన్ వెళ్తారు బారతదేశం అంటే ఎమిటో వాళ్లకి తెలియదు వారిలో చాలా మంది ఎప్పుడూ ఈ దేశంలో పని చెయ్యలేదు బారతదేశం అంటే వారికి ఒక వేసవి విడిది లాంటిది వాషింగ్‌టన్‌లోని తమ పై అదికారుల ఉద్దేశాలని వాళ్లు ఇక్కడ అదికారంలో ఉన్న వారితో కలిసి ఎలా అమలు పరచాలా అన్న ఆలోచనతోనే వస్తారు



ఇక్కడి వారు కూడా సంస్కృతి పరంగా విదేశీయులేకదా ఇటువంటి లోతు లేనటువంటి మనుషులే ప్రస్తుత పరిస్థితికి కారకులు

సర్వాదికారాలూ పార్టీకే ఉండాలని ప్రభుత్వం తన ఆజ్ఞలని జారి చెయ్యడానికి పార్టీ అనుమతి ఉండాలన్న బావం ప్రబలుతున్నట్లు కనిపిస్తున్నది పార్లమెంటరి ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం ప్రజల నించి అంటే పార్లమెంటు ద్వారా ఆదేశాలని తీసుకోవాలి పార్టీ ప్రమేయం దానిలో ఉండదు అవి పాసిస్టు లేక కమ్యూనిస్టు కావచ్చు కాని నియంతృత్వం ఉన్న దేశాలలోనే పార్టీకి సర్వాదికారాలు ఉంటాయి అయితే మనం మాత్రం క్రెమ్లిన్‌లోని ఎవరి దగ్గరినించో ఆదేశాలు తీసుకోవాలి బ్రిటన్‌లో 1950లలో అట్లీ ప్రభుత్వం కాలంలో అదికారంలో ఉన్న లేబర్ పార్టీ అద్యక్షుడు ప్రొపెసర్ హెరాల్డ్ లస్కీకి కూడా ఇటువంటి వెర్రిమొర్రి ఆలోచనలు ఉండేవి దేనికి అదికారం ఉండాలన్న విషయంలో ఒక అంశంపై ఆయన ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోబోయే ముందు అట్లీ మంత్రివర్గం తమని సంప్రదించాలని పట్టుబట్టారు అట్లీ దానికి నిరాకరించారు

బారత దేశంలోని పరిస్థితులు మరి దిగజారిపోయాయి సర్వాదికారిగా కాంగ్రెసు ఉందలేదు ఎందుకంటే అసలు ఆ పార్టీయే ఒక కల్పనలాంటిది అసలు అది లేదనే నా నమ్మకం ఆ పార్టీని ఒక కుటుంబం తాము నిరంతరంగా కేంద్రంలో అదికారంలో ఉండేందుకు సాదనంగా ఉపయోగించుకుంటున్నది రాష్ట్రాలలో తమ కుటుంబాల కోసం వసంత దాదా పాటిల్ వంటి వారు కూడా ఉపయోగించుకుంటున్నారు ఏ సిద్ధాంతానికీ అది కట్టుబడి లేదు కాబట్టి కాంగ్రెసుకి దేనిపైనా నమ్మకం లేదు అదికారంలో ఉన్న వ్యక్తులకి కూడా ఒక సిద్ధాంతం అనేది లేదు సామాజిక సిద్ధాంతం అంటూ లేని ఆ పార్టీకి ఆర్థిక విదానం అనేది కూడా లేదు విశ్వనాద్ ప్రతాప్‌సింగ్ దనవంతులకి మాత్రమే ఆదాయపు పన్ను తగ్గించారు అసలు ఆదాయం ఉన్నవారేకదా పన్ను కడతారు' బారతీయులలో సగం మందికి దాదాపు అసలు ఆదాయం అంటూ ఏమి లేదనే చెప్పాల్సి ఉంటుంది దనవంతులపై పన్ను తగ్గించి ఆ బారాన్ని పేద వారిపై వేసారాయన బలహీన వర్గాల అబివృద్ధి కోసమే ఆ పని చేసామని ఆయన అన్నారు బలహీన వర్గాల వారు ఎవరు"తాతాలు బిర్లాలా? వాళ్ల కంపెనీల వాటాలు ఆకాశాన్ని అంటుతున్నాయి లేకపోతే రామ్‌లు లాల్‌లా" వాళ్ళు పూట గడవని స్థితిలో ఉన్నారా"ప్రభుత్వం ప్రపంచ బాంక్ నించి పెద్ద ఎత్తున అప్పు తీసుకున్నది బహుళ జాతి సంస్థలకి స్వాగతం పలుకుతున్నది అయినా తాను అప్పుల వలలో ఎప్పుడూ చిక్కుకోలేదని ప్రమాణాలు చేస్తున్నది కాంగ్రెసు వాదులు ఎప్పుడూ అసత్యవాదులే కాని ఇప్పుడు దాన్ని మరి బాహాటంగా చేస్తున్నారు తమ పతనానికి ముందు గోబెల్స్ తదితరులు కూడా సరిగ్గా ఇలాగే చేసారు □

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)

7 13 మార్చి 1986
శ్రీ క్రోదన నామ సం మాఘ బ ద్వాదశి
సంపుటము 78 . సంచిక 26

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-50 |
| పోస్ట్‌లో 6 నెలల చందా | రు | 71-50 |
| పోస్ట్‌లో 12 నెలల చందా | రు | 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాందినగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక





# ఉత్తరాలు

## ముఖచిత్రం

సుందరమగు రూపము అర
విందంబుల బోలు కనులు విందును గూర్చున్
హుందా గల ముఖచిత్రము
పొందినటి ఫార జూచి యెల్లరు మెచ్చున్'

## కథలు (నీతి)

పొగరుబోతు కాటుక వెన్నెల గతి దలచు
దనికునకు పేదకున్ తుది దారి యొకటి
కడుపు గడువదు మేదొక ముడుపు నిడక
తెలివి వలయు లోకము పోకడ ల నెరుంగ!

–బాపట్ల వెంకటేశ్వరశాయి
చెరువు జమ్ములపాలెం

## ముఖచిత్రం

ఎవరమ్మా! ఈ కొమ్మా?
శిశిరాంతర వసంతాన
ప్రసవించిన పూరెమ్మా'
నీలాంబర సౌదాంతర
ప్రాచి దిశ గవాక్షాన
ఉదయించిన అరుణా రుణ
కిరణమ్మా?
ఎవరమ్మా?
ఎవరమ్మా'?

మ సూర్యప్రకాశరావు రాజమండ్రి

★ ★ ★

నటి మాదవి ముఖచిత్రంతో వెలువడిన 7 13 ఎబ్రవరి 86 సంచిక చాలా ఆకర్షణీయంగా వున్నది

పట్నాయ్కుని చిరంజీవిరావు ఆమదాలవలస

## కథలు

మాదవి ముఖచిత్రంతో వెలువడిన ఎబ్రవరి 7 13 సంచికలోని పులిపర్తి పూర్ణచంద్రరావు గారి అమ్మ కథ చాలా బాగుంది

పి రాము గుంటూరు

★ ★ ★

నటి పారా ముఖచిత్రం బాగుంది

పుట్టిన మనిషికి చావు తప్పదు జీవితకాలంలో ఎంత సంతోషాన్ని పొందారనేదే ముఖ్యం దారి ఒక్కటే కథలో శశిరబాబు ముసలయ్యల పాత్రలే నిదర్శనాలు

–జిట్టా రమణిమోహన్ కడప

★ ★ ★

ఫారా (24–30) ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో శ్రీ ఎమ్ ఆర్ ప్రసాద్ గారి కాటుక వెన్నెల కథ చాలాబాగుంది నేటి గవర్నమెంటు ఆసుపత్రుల దుస్థితిని చాలాచక్కగా వివరించారు

–సింగందత్తాత్రేయమూర్తి ఇతరులు
ఒంగోలు

★ ★ ★

31 1 6 2 86 సంచికలోని అన్వేషిగారి కుదుపు కథ వాస్తవానికి అద్దం పట్టినట్లుగా వుంది అనాటి జమిందార్ల కామానికి అహుతైపోయిన అబలల ఆర్తనాదాలు కాలగర్భంలో కలసిపోతే ఈ కథలో నీలిమకు జరిగిన అన్యాయాన్ని ఎదురించి బసవారెడ్డితో వివాహాన్ని జరిపించటం నేటి సమాజంలోని విప్లవాన్ని రచయిత చక్కగా సందేశాత్మకంగా మలచారు

గొర్జిల్ల రమణారావు
లక్ష్మిబాయి ఖర్గపూర్

## సీరియల్స్

మా అబిమాన ఆంద్రసచిత్ర వారపత్రికలో వెలువడుతున్న సీరియల్స్ అన్నీ ఒక దానికొకటి పోటిపడుతున్నవి వాటిలో 3డి సీరియల్ త్రివేణి ని రచయిత ఇచ్చాపురపు రామచంద్రం గారు ఆసక్తికరంగా రాస్తున్నారు మూడు వర్గాల కుటుంబాలలోని మనుషుల జీవన పద్ధతులు వారి నడవడులు వారికి వున్న అవకాశాలు చదువుతున్నప్పుడు ముఖ్యముగా మద్య తరగతి కుటుంబీకుడైన పాపారావు తన ఏకైక పుత్రుడు రామారావును చదివించుటకు తన అశక్తతను వ్యక్తపరచే విదానము అప్పుడు అతను అనుబవించిన మానసిక వేదన చదువుయందు రామారావు కనపరచిన శ్రద్ధాసక్తులు చదువుతున్నప్పుడు నిజంగా నవల పేరుకు తగినట్లు 3డి సినిమా చూస్తున్న అనుభూతిని పొందగలిగేము ఉన్నత విలువలు కలిగిన్న మంచి నవలను ప్రస్తుత పరిస్థితులు ప్రతిబింబించే విదముగా ప్రతిబావంతంగా రాస్తున్న రచయిత రామచంద్రం గారికి మా కృతజ్ఞతలు ఇతర సీరియల్స్‌కూడా ఆసక్తికరంగానడుస్తున్నవి

స్వరాజ్యలక్ష్మి ఆనందగజపతిరావు తెట్టంగి

★ ★ ★

మీ(మా) వార పత్రికయందు ప్రచురిస్తున్న సీరియల్ త్రివేణి చక్కగాను ఆసక్తికరముగా ఉంటోంది శీర్షిక పేరుకి తగ్గట్లుగానే రచనలో దనికులు బీదలేగాక మద్యతరగతి కుటుంబ పరిస్థితుల్ని కూడా మూడు డైమన్సన్‌లలో ప్రతిబింబించేటట్లు రచించిన 3డి కళ్ళద్దాలు అవసరము లేకుండానే పాఠకులకు 3డి సీరియల్ అందించిన రచయితకు అబినందనలు

–యస్ వి రామరాజు రూర్కెలా

□

**Statement about Ownership and other Particulars about Newspaper**

**ANDHRA SACHITRA VARAPATRIKA**

Form IV (See Rule - 8)

1 Place of Publication VIJAYAWADA

2 Periodicity of Publication WEEKLY

3 Printer s Name S Nageswara Rao, Whether citizen of India Yes Address 1 Luz Avenue Mylapur, Madras 600004

4 Publisher s Name Sri S Nageswara Rao Whether Citizen of India Yes Address 1 Luz Avenue Mylapur, Madras 600004

5 Editor's Name S Radhakrishna Whether citizen of India Yes Address 14 14 21 Mallikarjuna Rao Street Gandhinagar Vijayawada 3

6 Name and addresses of Individuals who own the News paper and partners of share holders holding more than one percent of the total capital (1) Name S Kamakshmma, 1 Luz Avenue Mylapur Madras 600004 (2) S Radhakrishna Address 14 14-21 Mallikarjuna Rao Street, Gandhinagar Vijayawada 3 (3) Name S Nageswara Rao Address 1, Luz Avenue, Mylapur Madras 600004 (4) Name S Rajeswari Address 14 14 21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3 (5) Name S Seshamma Address 1 Luz Avenue, Mylapur, Madras 600004 (6) Name S Sreeram Murthy, Trustee Kasinadhuni Nageswara Rao, Sivalenka Sambu Prasad Dharma Nidhi Address 42-45 Luz Church Road Madras 600004 (7) Name S Ramayamma Address 1 Luz Avenue, Mylapur Madras 600004 (8) Name P Satyanarayana Address Plot No 28 Bhagyalakshmi Nagar, (Behind Kalpana Talkies) Hyderabad 500380 (9) M/s Sambu Prasad & Sons P Ltd 63, Raya pettah High Road Madras 4 (10) Mr M S Kini, 1 9 1122/3/1 Dayananda Nagar, Hyderabad-4 (11) Sri Venkata Rao Kordale 1 1-593/2, Gandhinagar Hyderabad 38 (12) Smt P Lakshmi Sailaja P O Yellamanchili Visakhapatnam Dist (13) Sri V Sundaram No 20 First Main Road, Thiruvanmiyar Madras 41 (14) Sri R Gopalakrishna 79 Venkateswaranagar Kottivakkam Madras 41 (15) Sri S Sreeramamurthy, 63 Raya pettah High Road Madras 4 (16) Sri P Ramaswami 63 Rayapettah High Road, Madras-4 (17) Smt P V L Ratnam, Sreenagar Colony, Kakinada E G Dist (18) Master S V S Arvind, 1 Luz Avenue Madras-4 (19) Sri M S Ramesh, 16-11 19/5/2/A Saleemnagar Colony, Malakpet, Hyderabad - 36 (20) Smt P Nageswaramma, 1 Luz Avenue Madras 4

I S Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

1 3 1986

**S NAGESWARA RAO,**
Signature of Pu





(గత సంచిక తరువాయి)

రోజులు ఏమాత్రం మార్పు లేకుండా గడుస్తున్నాయి ఒక రోజు తెలిసింది పరాంకుశం గారు గుండె నొప్పితో చనిపోయారని రవ్వంతసేపు బాద పడ్డాను

* * * *

స్వరూప చెప్పడం ఆపింది

హరిత వాచీ చూసుకుంది

చాలా టైమయింది మళ్ళీ కలుస్తానని చెప్పి జైలు నుండి బయటకు వచ్చింది వరండాలో విక్రం తండ్రితో మాట్లాడుతున్నాడు

హరిత కళ్ళు మెరిసాయి

దొరగారికి మా ఇల్లు చాలా కాలానికి గుర్తొచ్చిందే

అంది నవ్వుతూ

విక్రం మాట్లాడలేదు

చూడమ్మా విక్రం నీ మీద చాలా కంప్లయింట్లు ఇచ్చాడు

ఆఁ ఏముంది గత ఆదివారం సినిమాకొస్తానని ప్రామిస్ చేసాను వెళ్ళలేదు నిన్న షాపింగ్‌కు వెళదామన్నాను అది కేన్సిల్ చేసాను దాంతో విక్రంకు కోపం వచ్చింది అంతేనా విక్రం

విక్రంతో అంది హరిత

విక్రం మాట్లాడలేదు ఈ సారి కూడా

అబ్బో బెట్టు అనుకుంది

అయినా ఈ లాయరు దొరికాడేమిటి మనకు ఏ కేసుగురించి సీరియస్‌గా ఆలోచించడు అసలు కేసులేమైనా వస్తున్నాయా అని నా అనుమానం

హరిత అలా అనగానే కోపం వచ్చింది విక్రంకు

మహా నీవే పెద్దలాయరువు నాకూ కేసులున్నాయి అయితే నీలా ఇరవై నాలుగ్గంటలూ తల బద్దలు కొట్టుకోను ఏయే పనులు ఏఏ సమయాల్లో

జరిగిన కథ–8 జైలు నుండి విడుదలైన భార్గవ తన తప్పు తెలుసుకొని మనిషిగా మారి భార్యను విడాకులు ఉపసంహరించుకోమంటాడు కానీ స్వరూప ఒప్పుకోలేదు భార్గవ స్వరూప ఇంట్లో లేనప్పుడు పాపను తనతో తీసుకు వెళ్ళిపోతాడు స్వరూప కొడుకు కిరణ్‌కి తల్లి అంటే ప్రాణం అతను డిగ్రీ పాసై యూనివర్సిటీలో చేరాడు భార్గవ తండ్రి పరాంకుశం కోడలు స్వరూప దగ్గరికి వచ్చి ఆమెను బాబుని తమ ఇంటికి రమ్మని అడుగుతాడు భార్గవ తల్లితండ్రుల దగ్గర లేడని తెలుసుకుంటుంది స్వరూప ఆమె మామగారి ఆహ్వానాన్ని తిరస్కరిస్తుంది పరాంకుశం నిరాశగా వెళ్ళిపోయాడు కిరణ్ త్రాగుడికి అలవాటు పడ్డాడని అది పరాంకుశంగారే మనవడికి త్రాగుడు అలవాటు చేసాడని తెలుసుకున్న స్వరూప తల్లడిల్లిపోతుంది కిరణ్ అమ్మాయిలతో షికార్లు చేయడం ప్రారంభించాడు కిరణ్ చేత ఒక ఫ్యాన్సీ షాపు తెరిపిస్తుంది స్వరూప ఆ ఫ్యాన్సీ షాపులో సేల్స్ గర్ల్‌గా చేరుతుంది గాయత్రి అనే అమ్మాయి ఆ అమ్మాయంటే స్వరూపకి అబిమానం

చేయాలో సిస్టమేటిక్‌గా చేస్తాను అంతేకానీ పిచ్చి పిచ్చి పనులన్నీ నెత్తిన పెట్టుకోవడం నాకలవాటు లేధు

విక్రం సీరియస్‌గా అన్నా తేలిగ్గా తీసుకుంది హరిత

చూడు విక్రం నువ్వు స్వరూపగారి కేసుగురించే కదా మాట్లాడేది

అవును హత్య చేసానని తనంతట తానే నిర్భయంగా కోర్టులో చెప్పింది శిక్ష పడడం ఎలాగూ ఖాయం అటువంటప్పుడు ఆమెను కాపాడాలని ఎందుకంత ఇంట్రెస్టు చూపుతున్నావ్ హత్యకు దారి తీసిన సంఘటనలు చెప్పడానికి ఆమె ఇష్టపడడం లేదు జడ్జి గారిచ్చిన గడువు రెండు రోజులున్నాయి ఇంకా ఆమెను శిక్ష నుండి తప్పించాలన్న నీ పట్టుదల ఎంత సమంజసమో నాకర్థం కావడం లేదు

విక్రం ఆమె గురించి పూర్తిగా తెలుసుకుంటే ఇంత ఈజీగా మాట్లాడవ్ ఆమే కాదు ఆమె స్థానంలో ఏ స్త్రీ ఉన్నా సాటి స్త్రీగా రక్షించాలన్న ఉద్దేశ్యమే నాది

ఏ తప్పు చేయకుండానే రాక్షసు లైన అత్తలు భర్తల వలన రకరకాల హింసలకు గురవుతున్నారు ఈ సమాజంలోని స్త్రీలు స్త్రీ పురుషులందరూ సమానులే అని బల్ల గుద్ది చెప్పే పెద్ద మనుష్యులే ఇటువంటి పనులకు పాల్పడుతున్నారు పురుషుడితో సమానంగా అన్ని రంగాలలో ఆధిక్యత సంపాదిస్తున్నా జీవితంలోకి వచ్చే సరికి ఆడది ఆడదిగానే ఉండి పోతుంది భర్తలు అత్తలు ఆడపడుచులు ఎన్ని బాధలు పెట్టినా గుంభనంగా ఉండడానికే ప్రయత్నిస్తుంది తప్ప ఎదురు తిరిగే ధైర్యాన్ని సంపాదించడం లేదు స్వరూపలాంటి ఏ కొందరో ఎదురు తిరిగినా ఆ ఆడదాన్ని వేలెత్తి చూపించి ఏ చిన్న తప్పు చేసినా కొండంతలు చేసి హేళన చేస్తుంది నేటి పురుషాధిక్యత సమాజం

ఆమె హత్య చేసిందా లేదా

ఏది ఏమయినాదోషిగా నిలబడింది

ఆమె చరిత్ర అంతా తెలిసింతర్వాత గానీ హంతకురాలని చెప్పడానికి వీల్లేదు జడ్జి గారిచ్చిన గడువులోగా స్వరూపగారి నుండి అన్ని వివరాలు సేకరించి కోర్టు వారికి తెలియ జేస్తాను

ఆవేశంగా అంది హరిత

★ ★ ★ ★

హరితా

స్వరూప పిలుపులో ఆర్ద్రత తొంగి చూసింది

హరిత హృదయంలో ఏదో అనుభూతి

ఏమిటంత ఆశ్చర్య పోతున్నారు

హరిత స్వరూప చేతులు పట్టుకుంది

మీరు పెద్దవాళ్ళు నన్ను గారు ఎవండీ అనొద్దు హరితా అనండి చాలు

చిన్నగా నవ్వింది స్వరూప

ఎందుకమ్మా అంత ఆనందం సాటి ఆడదానివి అందులో చిన్న పిల్లవు అలా ఏకవచనంలో పిలవడం నాది పొరపాటు లాయరు గారికి గౌరవం ఇవ్వడం ఖైదీగా నా బాధ్యత

ఖైదీ అన్న పదాన్ని నొక్కి పలికింది

హరితకు వింతగా ఉంది స్వరూప మనస్తత్వం జీవితంలో ఎంతటి బాధ అనుభవించిందో మాటల్లోనే స్పష్టమవుతుంది

చూడమ్మా మీతో మాట్లాడ్డానికి నాకున్న సమయంలో ఈ రోజు ఆఖరు రోజు ఈ రోజు మీ నుండి పూర్తి వివరాలు సేకరించందే కదలను రేపు



# చైతన్య స్వరూపం

అవసరమైతే ఆదారాలు కోసం కొందరి వ్యక్తులను కలవాలి చెప్పండి

★ ★ ★ ★

కిరణ్ ఓ దారి కొచ్చాడని నిర్ధారించుకున్నాను అదే నాక్కావలసింది రోజులు సాఫీగా గడుస్తున్నాయి

ఈ మధ్య పాప ధ్యాస ఎక్కువైందినాకు

పాపను చూడాలి

పాపను గుండెలకు హత్తుకోవాలి

బార్గవ ఎక్కడున్నాడు

పాప ఎలా ఉంది

నాభర్త బార్గవతో పూర్తిగ తెగతెంపులుచేసుకున్న తర్వాత అతను తిరిగి నాకంటికి కనిపించడను కున్నాను అయితే ఒక రోజు

మా కొలీగ్ కొడుకు పెళ్ళికి వెళ్ళాను

ముహూర్తం రాత్రి రెండు గంటలకు•అప్పుడింకా పదే అయింది ఓ గంట రెస్టు తీసుకుందామని సందడి లేని ఓ గదిలోకి దారితీస్తుంటే ఎదురుగా వచ్చిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాను

అతను బార్గవ

క్షణంసేపు కళ్ళప్పగించి నిలబడిపోయ్యాను

బార్గవ ముసలివాడయ్యాడని చెబుతున్నట్లుగా మెరిసిన జుత్తు కళ్ళద్దాలు అయితే డబ్బు ఇచ్చిన ఆరోగ్యం శరీరాన్ని ముడుతలు పడనివ్వ లేదు

అతను నా భర్త అనుకుంది నా ఆడమనసు

అతను నాకేసే చూస్తూ నిలబడి పోయాడు

ఆ సమయంలో ఇద్దరిలో ఎటువంటి అలజడి రేగిందో గాని పైకి మాత్రం నేను ప్రశాంతంగానే ఉండి పోయాను

బాగున్నారా

ఎవరో అపరిచిత వ్యక్తిని పలకరించినట్లుగా నాగొంతులోంచి వచ్చిందా ప్రశ్న

బార్గవ మాట్లాడలేదు

బార్గవ కనిపించడంలో నాలో ఎటువంటి ఆనందం కలగలేదు గానీ ఈ విదంగానైనా పాప గురించి తెలుస్తుందనే సంతోషం

బార్గవ మాట్లాడక పోవడంతో నేనే ఓ అడుగు ముందుకు వేసి మితో ఒక పావుగంట మాట్లాడాలి అన్నాను

అతను నేను కొంచెం దూరంగా వెళ్ళాం

పాప ఎలా ఉంది

బాగానే ఉంది

పొడిగానే సమాదాన మిచ్చాడు

పాప ఇప్పుడెక్కడుంది

అతను టాపిక్‌ను మార్చడానికి ప్రయత్నించాడు

నీ కంటికి కనిపించనని మాటిచ్చాను అయినా తప్పలేదు ఈ పెళ్ళిక నువ్వు వస్తావని తెలిస్తే రాకపోయేవాడిని అయాం సారి

అతనలా అనగానే ఆ రోజు రాసిన ఉత్తరం గుర్తుకొచ్చింది

మన పాపను చూడాలని ఉంది

బారవ నవ్వాడు

చూడు స్వరూపా ఎరోజైతే నన్ను జైలుకు పంపించావో ఎరోజైతే విడాకులు నా ముఖాన విసిరేవో ఎరోజైతే నేను మారానని చెప్పినా క్షమించ లేక నీతో పిల్లలతో బ్రతికే అవకాశం ఇవ్వకుండా బయటకు పొమ్మన్నావో ఆరోజే నీకు నాకు మద్య ఉండే మన అనే బందం తెగిపోయింది

చాలా కటువుగా అన్నాడు

ఎంతసేపు చలించినా సర్దుకున్నాను

నేనడిగింది మన మద్య ఉండే బందం గురించి కాదు పాప గురించి

పాపగురించి అడిగే అధికారం నీకు లేదు ఇద్దరం విడిపోయాం పిల్లలిద్దరినీ సమానంగా పంచుకున్నాం

బార్గవ అలా మాట్లాడతాడని ఊహించలేదు

పాప తల్లిని

తల్లివి కాదనను ఇన్ని సంవత్సరాలు పాపను చూడకుండా ఉండగలిగిన నీకు ఇప్పుడు పాప మీద మనసు మళ్ళిందంటే నేను నమ్మను పాప మీద బ్రమ కలిగి కాదు నాలాంటి రాక్షసుడి దగ్గర ఎలా పెరిగిందో నని నన్ను పరీక్ష చేయడానికే అడుగుతున్నావ్ కాని నువ్వనుకున్నట్లు కాక లక్షణంగా బుద్ధి మంతురాలిలా పెరిగి పెద్దదైంది

భార్గవ దెబ్బ పొడిచాడు

అతనలా మాట్లాడ్డంలో వింత కాక పోయినా నా మనసు బాదతో గిలగిల కొట్టుకుంది నిజంగా పాపను చూడాలని ఉందనో అతనికి ఎలా చెప్పాలో తోచలేదు అప్రయత్నంగా నాకళ్ళల్లో నీళ్ళు నిలిచాయి

చూడు స్వరూపా నీకు కనిపించి గతాన్ని గుర్తుకు తెచ్చి బాద పెట్టిన వాడి నైతే క్షమించు వస్తా

అక్కడనుండి కదల బోయాడు బార్గవ

ఆగండన్నాను

నాకు పాపను చూడాలని నామనసు తపిస్తుంది ఒక్కసారి చూపించండి

ప్రాదేయ పడుతూ అడిగాను

సారి పాపకు మంచి తల్లి ఉంది ఆమెలో అమ్మను చూస్తూ మురిసిపోతుంది ఇప్పుడు నిన్ను చూపిస్తే నా డాడీకి మరో బార్య కూడా ఉందా అని అడిగితే బరించలేను పాప దృష్టిలో కూడా నన్ను రాక్షసుడిగా చిత్రించడానికి ప్రయత్నించకు






# మీపాపాయికి సిరిలాక్ ప్రేమను అందివ్వండి!

సుమారు 4వ నెల నుంచి, మీ పాపాయికి పాలతోపాటు, ఘనపదార్థాలు కూడా అవసరమవుతాయి. బాబుకు సిరిలాక్ ప్రేమను అందించడానికి తగిన సమయం ఇదే.

**పోషకాహారపు లాభం :** ప్రతి సిరిలాక్ మోతాదు, మీ పాపాయికి కావలసిన పోషకాహారాలు—మాంసకృత్తులు-కార్బొహైడ్రేట్లు-కొవ్వు-విటమిన్లు-ఖనిజాలను సమకూరుస్తుంది. మీ పాపాయి ప్రత్యేక అవసరాలకు తగినట్టు సమపాళ్లలో తయారయింది

**త్వరితగతి లాభం :** మీ పాపాయికి ఎప్పుడు కావాలంటే, అప్పుడు, సెకెన్లలో సిద్ధమవుతుంది. దీనిలో పాలు, పంచదార ఉండనే ఉన్నాయి. ఇక, మీరు, ముందు మరిగించి వుంచుకున్న నీటిలో దీన్ని కలపాలి-అంతే!

**రుచి లాభం :** మొదటి ఘన ఆహారం, కొత్త గమ్మత్తు రుచినీ అనుభూతినీ ఇస్తుంది. పాపాయిలకు దీని రుచి ఎంతో నచ్చుతుంది. ఇది, శుభారంభం కూడా. మీ పాపాయికి సమపాళ్లలో పోషకాహారాన్ని అందచేసేందుకూ, తయారీలో శుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను అనుసరించండి.

**పెరుగుదల పట్టిక ఉచితం !**
మీ పాపాయికి తన స్వంత పెరుగుదల పుస్తకం కోసం రాయండి-సిరిలాక్, పోస్టుబాక్సు-3 కొత్త ఢిల్లీ-110008

ఇప్పుడు






# చైతన్య స్వరూపం

అంటే మళ్ళీ పెళ్ళి చేసుకున్నారా

భార్గవ గట్టిగా నవ్వేడు

ఎందు కంత ఆశ్చర్యం భార్య చనిపోతే మరో పెళ్ళి చేసుకోవడానికి తయారయ్యే ఈ రోజుల్లో భార్య బ్రతికుండీ ఆమెచేత ఛీ అనిపించుకుంటే ఏ మగాడు పెళ్ళి చేసుకోకుండా ఉంటాడు అప్పుడా నేను వయసులో ఉన్నాను ఆడది కావాలి అదిగాక ఎదిగే పాపకు అమ్మ కావాలి

భార్గవలో ఇంకా మూర్ఖత్వం తగ్గలేదు

ఈ పరిస్థితిలో పాపను చూపించ గలడనే ఆశ ఆశగానే మిగిలి పోయింది అతనింకా పట్టుదల విడువలేదు ఇక నేను బేలగా వాపోయినా భార్గవ మనసు కరగదు అంతలో గుర్తొచ్చింది

సరే పాపను చూపించవద్దు కానీ మి గెలుపు కోసం నా బ్రతుకు మీద ఆశయాల మీద బురద జల్లడానికి ప్రయత్నిస్తారెందుకు నేను ఓడి పోయి పాతాళ లోకంలోకి కృంగి పోతుంటే చూసి ఆనందించడానికి మిరింత నాటకం ఆడుతున్నారెందుకు?

భార్గవ ముఖం ప్రశాంతంగా మారింది నా ప్రశ్నకు

ఏనాటకం తెలియనట్లు అడిగాడు

ఎమీ తెలియనట్లు నటించ వద్దు నాతో పందెం వేసి తెలివితేటలతో గెలవ లేక మీ నాన్నగారితో మీ రాడించే నాటకం గురించి నాకు తెలిసింది నా మీద కక్షతో నా ఆశలను వమ్ము చేయాలనే బాబును మీ వైపుకు మళ్ళించుకుని వాడికి దురలవాట్లు నేర్పి జులాయిలా తయారు చేయాలని చూస్తున్నారు పెద్దవారయి ఉండీ కూడా మీ నాన్నగారు బాబుకు డ్రింక్ పట్టించారు బాబు నా దగ్గర ఉండొచ్చు కానీ వాడు కూడా మీ రక్తం పంచుకుని పుట్టిన వాడన్న సంగతి కూడా మరచి పోయి కేవలం గెలుపు కోసం మంచి చెడ్డలు వాటి విలువలు మరచి ప్రవర్తిస్తున్నారు బాబు ఆ క్షణంలో ఆ వయసు చేసే అల్లరి పనులకు కాస్తంత లొంగినా శాశ్వతంగా వాటికి బానిస కాడు అలా కాకూడదనే నా శక్తినంతా ధార పోస్తున్నాను మన మధ్య ఏ బంధం లేదని తెలుసుకుని నన్ను గెలవాలనే ఆరాటమే మీకుంటే నేను కూడా అదే పట్టుదలతో ఉంటాను గుడ్ బై

భార్గవకు మరో మాటకు అవకాశం ఇవ్వకుండా అక్కడ నుండి కదిలాను ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతుంది ముహూర్తం టైము వరకూ ఉండలేక ప్రెజెంటేషన్ ఇచ్చి ఒంట్లో బాగా లేదని చెప్పి ఇంటికి వచ్చేసాను

రాత్రి నిద్ర కరువయింది

ఆలోచనలు పాప చుట్టూ తిరుగుతున్నాయి

భగవాన్ నా పాపను ఒక్కసారి చూపించు అనుకున్నాను మనసులో

* * * * *

ఆ రోజు నేను కాలేజీకి వెళ్ళలేదు

కిరణ్ షాపుకు వెళ్ళడానికి తయారవుతున్నాడు

భార్గవ కనిపించినప్పటి నుండి నా మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తుంది అందరి ఆడపిల్లల్లా కాకుండా నా జీవితం ఇన్ని మలుపులు తిరుగుతుందేమిటి? ఆ రోజున భార్గవను జైలుకు పంపించడంలో పొరపాటు చేసానా? జైలు నుండి వచ్చింతర్వాత క్షమించమంటూ వచ్చిన భార్గవను ఘోరంగా పంపేయడంలో విడాకులివ్వడంలో పొరబడ్డానా పాపను తీసుకెళ్ళాక పాప కోసం ఆరా తీయకుండా ప్రశాంతంగా ఉండి పోవడంలో తప్పు చేసానా? కేవలం గెలుపు కోసం ఒంటరిగా మొండిగా ఉండిపోయానా?

ఎది తప్పో ఏది ఒప్పో బేరిజు వేసుకోలేక పోతున్నాను

ఎది ఎలా జరుగుతుందో అలాగే జరగనిచ్చే కన్నా ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు

మమ్మీ వెళ్ళొస్తా

కిరణ్ మాటతో ఉలిక్కి పడ్డాను (ఇంకా ఉంది)




## అవును మరి 6 సం"ల నేషనల్ సేవింగ్స్ సర్టిఫికెట్లు పారిజాతం వృక్షం కంటే విలువైనవి.

అందులో అటు వడ్డీకి వడ్డీ ఇటు పన్ను మినహాయింపులు పెద్ద ఎత్తున లబిస్తాయి మీరు ఆదాయపు పన్ను కట్టే వారైతే సుమారు 2 రు ల వడ్డీ లబిస్తుంది అంటే 25 శాతం వరకు వడ్డీ పొందవచ్చు ఆదాయపు పన్ను కట్టేవారు కాకపోయినా మీకు రుపాయిన్నర వడ్డీ లబిస్తుంది అంటే సుమారు 18 శాతం వడ్డీ అన్న మాట ఇంకా ఎన్ని లాబాలు ఉన్నాయో మీకు తెలుసా!

1) ఉమ్మడిగా కాని మీ పిల్లల పేరుతో కాని కొనుక్కోవచ్చును కొన్న తరువాత ఎవరి పేరునైనా సరే మార్చుకోవచ్చును
2) ఈ సర్టిఫికెట్లను దేశంలో ఎక్కడైనా ఏ పోస్టాఫీసులోనైనా మార్చుకోవచ్చును
3) తాకట్టు నామినేషన్ సదుపాయాలున్నాయి
4) మీ సొమ్ముకు ప్రభుత్వ భద్రత
5) రు లు 10 50 100 500 1000 5000 మరియు 10 000 మూల్యాలలో దొరుకుతాయి

CANON ADS

మిగతా వివరాలకు మీ దగ్గరలోని పోస్టాఫీసులో గాని కలెక్టరేట్‌లోని తహసిల్దారునుగాని భారతప్రభుత్వ జిల్లా పొదుపు కార్యాలయంలో గాని రీజనల్ డిప్యూటీ డైరెక్టర్ (స్మాల్ సేవింగ్స్) ను గాని నేషనల్ సేవింగ్స్ ఏజెంట్‌ను గాని సంప్రదించండి



కమీషనర్, స్మాల్ సేవింగ్స్,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హిమాయత్ నగర్, హైదరాబాదు - 500 029





**జాతీయ పొదుపు సంస్థ**

మీ భద్రతే మా లక్ష్యం

# విశ్వమానవాళిని పరితాపంలో ముంచిన ఛాలెంజర్ పతనం!

అంతరిక్ష శాస్త్రంలో అనూహ్యమైన విజయాలను సాదిస్తున్న తరుణంలో అమెరికన్‌లు ఇటీవల ప్రయోగించిన ప్రతిష్ఠాత్మక వ్యోమనౌక చాలెంజర్ ఎడుమంది అంతరిక్ష యాత్రీకులతో సహా పతనమై సాగరగర్భాన్ని చేరడం ఎంతైనా బాదపెట్టే అంశం! అమెరికా గత పాతికేళ్ళుగా 55 పర్యాయాలు అంతరిక్షంలోకి వ్యోమ నౌకలను వ్యోమగాములతో సహా పంపుతోంది క్రమానుగతంగా అంతరిక్ష శాస్త్ర పరిజ్ఞానాన్ని పెంచుకొంటోంది ఎదురు దెబ్బలకి తట్టుకొని నిలబడగలుగుతోంది జనవరి 27 1967న అమెరికన్‌లు ప్రయోగించిన అపోలో వ్యోమ నౌకలోని నావికలు వర్జిల్ గ్రిస్సమ్ (40), ఎడ్వర్డ్ వైట్ (36), రోజర్ చాఫీ (31) మరణించిన విషయం ఈ సందర్భంలో గుర్తుకు వస్తుంది. సోవియెట్ వ్యోమ వీరుడు వ్లాడిమిర్ కొమరోవ్ (40) దుర్మరణం కూడా జ్ఞప్తికి వస్తుంది. అయితే ఈ దురదృష్టకరమైన సంఘటనలన్నీ అంతరిక్ష జిజ్ఞాసులై తప్పటడుగులు వేస్తున్నప్పుడు జరిగినవి. ఎంతో అనుభవాన్ని కలిగి ఉండీ అనుకొని విధంగా ఛాలెంజర్ విషయంలో భంగపడడం విచారకరమే! ఎన్నో విజయసోపానాలను అధిరోహించాలని నిరంతరం తాపత్రయపడే మానవాభిగమనంలో ఇలాంటి సంఘటనలు తప్పవు ఈ సంఘటనలను ఆదారంగా తీసుకొని ముందు ముందు మరింత జాగ్రత్తపడవలసి ఉంటుంది

చాలెంజర్‌ను ప్రయోగించడం ఇది మొదటి సారి కాదు ఇప్పటికే అది ఇరవైనాలుగుసార్లు అంతరిక్ష విన్యాసాలు చేసి వచ్చింది కృత్రిమ ఉపగ్రహాలను అంతరిక్ష కక్ష్యలలోకి దింపి రావడం చెడిపోయిన కృత్రిమ ఉపగ్రహాలకు మరమ్మత్తులు చేసి సరి చేసి రావడం అవసరమనుకొన్న కృత్రిమ ఉపగ్రహాలను భూమిపైకి తీసుకొని రావడం ఇలాంటి పనులను ఈ ఛాలెంజర్ తిరుగులేని విదంగా చేసిపెట్టింది హేలీ తోక చుక్కకి సంబందించిన వివరాలను సేకరించడంలో కూడా దీని పాత్ర గణనీయంగానే ఉండేదని తెలుస్తోంది 120 కోట్ల డాలర్ల కర్చుతో అగణిత మేదా శక్తితో రూపొందిన ఈ చాలెంజర్ ఊహకి కూడా అందని విదంగా విశ్వాంతరాళంలో పెల్లుబికి వచ్చిన విసిల మార్తాండ జ్వాలలలో చిక్కుకొని బస్మీపటలమైపోవడం ఎంతో ఆవేదనని కలిగిస్తుంది

జనవరి 28 1986న ఆకాశం నిర్మలంగా ఉన్న ఉదయ సంధ్య వేళ చాలెంజర్ గగన తలంలోకి వెళ్లాలని నిర్ణయించబడింది అప్పటికే దీని ప్రయాణం నాలుగుసార్లు వాయిదా పడింది ఈ చాలెంజర్‌లో వ్యోమగాములుగా వెళుతున్న వారిలో ఇద్దరు మహిళలు అయిదు మంది పురుషులూ ఉన్నారు ఇందులో అయిదు మందికి అంతరిక్ష యాత్రానుబవం ఉంది ఇద్దరికి మాత్రం అదే తొలిసారి ఈ ఎడు మందిలో ఎక్కువ బాగం మిలటరి పైలట్‌లు, శాస్త్రవేత్తలు, ఇంజనీర్‌లు కాగా... ఒక్క

రోనాల్డ్ మెక్‌నేర్

మహిళ మాత్రం స్కూల్ టచరు!

ఫ్రాన్సిస్ ఆర్ స్కోబీ (46) చాలెంజర్ కమాండరు మైకేల్ జె స్మిత్ (40) నౌకాదళం కమాండరు జ్యూడిత్ ఎ రేస్నిక్ (36) చాలెంజర్ మహిళా స్పెషలిస్టు ఎలిసన్ ఎస్ ఒనిజుకా (39) వైమానిక దళంలో లెప్టినెంట్ కర్నల్ గ్రెగరి బి జార్విస్ (41) హాలోడ్ స్పెషలిస్ట్ రోనాల్డ్ ఇ మెక్‌నేర్ (35) చాలెంజర్ మెషిన్ స్పెషలిస్ట్ ఎస్ క్రిస్టామెకాలిఫ్ (37) సెకండరి స్కూల్ టీచర్ 11 వేల మంది దరకాస్తు చేయగా ఎంపిక కాబడ్డ మహిళ మెకాలిఫ్ ఈ యాత్ర విజయవంతమై ఉంటే అంతరిక్ష యాత్ర జరిపిన తొలి ప్రయివేట్ సిటిజన్‌గా మెకాలిఫ్ చరిత్ర కెక్కి ఉండేది

జనవరి 28 ఉదయాన్నే కేప్ కానవెరల్ సమీపంలో ఉన్న నాసా అంతరిక్ష ప్రయోగ కేంద్రం పరిసరాలు జనంతో కిటకిటలాడిపోయింది లక్షలాది మంది అమెరికన్‌లు టీ వీ ల ముందు కూర్చొని ఉన్నారు ఛాలెంజర్ ప్రయాణానికి సిద్ధంగా ఉంది సాంకేతిక లోపాలేవీ లేవని నిర్ధారించుకోవడానికి ప్రతి ఒక్కరూ శ్రమ పడవలసి వచ్చింది స్కోబీ స్మిత్ ఫ్లైట్ డెక్ చేరారు మిగతా వ్యోమగాములంతా మిడ్‌డెక్ లో కూర్చొన్నారు బయలుదేరడానికి సిద్ధంగా ఉంది ఛాలెంజర్! అంతా సవ్యంగా ఉందా అని మరోసారి చూడడం జరిగింది

చాలెంజర్ ఇంజన్‌లతో సంబందాన్ని కలిగి ఉన్న 154 అడుగుల పొడవుగల జేగురు రంగు ఇందనపు టాంక్ పటిష్టంగా ఉంది ఇందులో 143351 గాలన్‌ల లిక్విడ్ ఆక్సిజెన్ 385265 గాలన్‌ల లిక్విడ్ హైడ్రోజన్ ఉంది. ఈ టాంక్‌కు రెండువైపులా 149 అడుగుల పొడవుగల రెండు బూస్టర్‌లు ఉన్నాయి. ప్రతి బూస్టర్‌లోనూ 11 లక్షల పవుండ్ల బరువు చేసే ఘన పదార్థ రూపంలో ఉన్న ఇంధనం ఉంది. ఛాలెంజర్ ప్రయోగ సందర్భంలో వినవచ్చే ప్రేలుడు వల్ల ఛాలెంజర్ ఇంజన్‌లు దెబ్బ తినకుండా పరదలా నీటి ప్రవాహాన్ని రంగంలోకి దింపడానికి వీలుగా ఆరు సువిశాలమైన గొట్టాలు సిద్ధంగా ఉన్నాయి. ప్రతి గొట్టం వ్యాసం ఏడు అడుగులకు తక్కువగా లేదు. వేదిక సిద్ధంగా ఉందని, ఏర్పాట్లన్నీ సంతృప్తికరంగా ఉందని నిపుణులంతా నిర్థారించాక చాలెంజర్ ప్రయాణానికి హూస్టన్‌లో ఉన్న జాన్సన్ స్పేస్ సెంటర్ సమాచార ప్రతిపాదకుడు స్టీవ్ నెస్‌బెట్ అదికారపూర్వకంగా సమయాన్ని నిర్ణయించాడు!

చూస్తుండగనే పది నిమిషాలు గడచిపోయాయి చాలెంజర్ గగనతలంలోకి దూసుకొని వెళ్లింది జన సముద్రంలోంచి ప్రతి ధ్వనించిన హర్షాతిశయం అమితోత్సాహంతో చాలెంజర్‌ను పరిశీలించసాగింది

16 సెకండ్‌ల తర్వాత ఫ్లైట్ డెస్క్ లో ఉన్న స్కోబీ చాలెంజర్‌ను రోల్ చేయాలి అంటూ నియంత్రణ కేంద్రాన్ని కోరాడు 35 సెకండ్‌ల తరువాత నెస్‌బెట్ ఎంతో ఆసక్తిగా అంతా సవ్యంగా ఉంది సెకండ్‌కు 2259 అడుగుల వేగంతో చాలెంజర్ పోతోంది అని ప్రకటించాడు 52 సెకండ్‌ల తరువాత చాలెంజర్ రోల్ చేయబడడానికి ఆదేశాలు ఇవ్వబడ్డాయి ఈ రోలింగ్ వల్ల చాలెంజర్

ఫ్రాన్సిస్ స్కోబీ

జ్యూడిత్ రెస్నిక్

క్రిస్టా మెకాలిఫ్



ఛాలెంజర్ పతన దృశ్యం




పైభాగానికి వెళ్ళి ఇంధనపు టాంక్, బూస్టర్‌లు క్రిందికి వస్తాయి. 70 సెకండ్‌లు గడిచాయి. సెకనుకి 2900 అడుగుల వేగంతో ఛాలెంజర్ వెళుతోంది. మరో మూడు సెకండ్‌లు గడిచాయి. ఇంధనపు టాంక్ క్రింది భాగం నుంచి జేగురు రంగు మంట కనిపించింది. దట్టమైన తెల్లటి పొగ ఆవరించింది. క్రమేపీ ఆ మంట ఛాలెంజర్‌ను ఆక్రమించింది. క్షణాలు కూడా గడవక ముందే ఛాలెంజర్ అరుణగోళంలా ప్రచండ రూపం దాల్చింది. అశేష ప్రజానీకం ఆశ్చర్యంతో ఆందోళనతో సంక్షోభ హృదయంతో మనో క్లేశంతో చూస్తూ ఉండగనే ఛాలెంజర్ ముక్కలు ముక్కలై అట్లాంటిక్ మహా సముద్ర గర్భంలో శాశ్వతంగా చల్లబడింది.

మూగవోయిన అమెరికా కొన్ని క్షణాలపాటు తేరుకోలేకపోయింది. మొత్తం మానవ ప్రపంచం ప్రకంపించిపోయింది. రుద్ధ కంఠంతో పరితపిస్తూ రోనాల్డ్ రీగన్ అన్న మాటలు ఎవరినైనా కదలిస్తాయి.

"ఛాలెంజర్ పతనం ఎంతో విచారకరం. అందులో ప్రయాణించి అసువులు కోల్పోయిన వారంతా దేశసేవా పరాయణులు. సేవ చేయాలన్న సత్సంకల్పంతో సేవ చేస్తూనే వారు ధన్యులయ్యారు. విశ్వ రహస్యాలను ఛేదించాలని వారెంతో తపనపడేవారు.

ఇలాంటి హృదయ విదారక ఘటనలు ఎవరినైనా బాధిస్తాయి. మానవ ప్రయత్నం అనంతమైనది. అవరోధాలను అధిగమిస్తూ ప్రయాణిస్తూనే ఉండాలి. మన ప్రయత్నాన్ని విజయవంతంగా నిర్వహించగలిగిననాడే ఈ ఛాలెంజర్ వ్యోమగాములకు ఆత్మశాంతి కలుగుతుంది".

ఎవరు మాత్రం ఇంతకు మించి ఏం చెప్పగలరు?

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

మైఖేల్ స్మిత్



ఎలిసన్ ఒనిజుకా



గ్రెగరి జార్విస్



# అమరావతీ క్షేత్రం



క్షేత్రపాలకుడు శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం

లోక కళ్యాణార్థం దేవదానవుల కనేకమార్లు మహాసంగ్రామాలు జరిగేయి వాటి సాక్షిభూతంగా మన భారతావనిలో పెక్కు క్షేత్రాలు విలసిల్లాయి అందులో తారకాసురుని మరణంతో ఏర్పడిన పంచారామములు మన ఆంధ్రావనిలో నెలకొని యుండడం మన అదృష్టం పంచారామములో అగ్రగామి అమరావతీ క్షేత్రం కవి సార్వభౌముడు శ్రీనాథ మహాకవి చే ఆది మారామముగా కీర్తింప బడిన ఈ క్షేత్ర చరిత్ర అద్వితీయం

గుంటూరునకు సుమారు 30 కి మి దూరంలో గల అమరావతి ఇతిహాస పూర్వకంగా చారిత్రాత్మకంగా ప్రసిద్ధినొందినది పుణ్య కృష్ణానది తీరాన క్రౌంచగిరిపై వెలిసిన అమరేశ్వరుని దేవేంద్రుడు స్వయంగా ప్రతిష్ఠించి పునీతుడయ్యేనని చెప్ప బడుతోంది

## ఇతిహాసం

పూర్వం మహా శివభక్తుడు ప్రాణలింగ గ్రహీతుడూ అయిన దానవ చక్రవర్తి తారకాసురునకు దేవగణసమేతుడైన కుమారస్వామికి జరిగిన యుద్ధంలో పరమేశ్వరుని హితోపదేశంతో ఆ మయూర వాహనుడు తారకాసురుని కంఠమునందు గల ప్రాణలింగాన్ని ఛేదించి ఆ అసుర చక్రవర్తిని అంతమొందించాడు ప్రాణలింగం అయిదు ప్రక్కలయి వివిధతావులలో పడగా వాటిని దేవతలే స్వయంగా దేవ గురువు బృహస్పతి పర్యవేక్షణలో ప్రతిష్ఠించేరు అవియే అమరారామము కుమారారామము భీమారామము ద్రాక్షారామము క్షీరారామము లుగా ప్రసిద్ధినొందినవి

అమరారామములో శివలింగాన్ని ముక్కోటి దేవతల సమక్షమున అమరేంద్రుడు అశ్వయుజ శుద్ధ దశమినాడు ప్రతిష్ఠించి అమరేశ్వరుని గా నామకరణ మొనరించి పవిత్రుడాయెను దేవతలు కూడా అంబికా మున్నగు పరివార దేవతలను ప్రతిష్ఠించి కొద్దికాలము అచట వసించి స్వామిని సేవించి తరించేరు అమరులు మసలిన తావు కనుక అమరావతిగా ఈ క్షేత్రం ఖ్యాతినొందింది

## చరిత్ర

కొన్ని వేల సంవత్సరముల చరిత్ర కల్గిన ఈ పుణ్యక్షేత్ర నిర్మాణాభివృద్ధికి రాళ్ళిచ్చిన రాజు లెందరో

ఇక్కడ భద్రపరుచబడిన శిలా శాసనముల ననుసరించి క్రీ శకం 1158లో కొమ్మ నాయకుడు 1183లో కోట కేతరాజు 1361లో అనవేమారెడ్డి 1517లో శ్రీకృష్ణ దేవరాయలు 1621లో హంద్రికం పెద్దప్పంగారు ఈ ఆలయాన్ని దర్శించి స్వామి వారికి విశేష కానుకలు మాన్యాలు ఇచ్చి చరితార్థులయ్యేరని వెల్లడి అవుతోంది

క్రీ శకం 1783 1816లలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు గారి హయాంలో ప్రస్తుతం మనం చూసే అమరేశ్వరాలయం రూపురేఖలు దిద్దుకొంది వారి మరణానంతరం నాటి హైదరాబాద్ నవాబు కలలో స్వామి సాక్షాత్కరించి ఆలయ నిర్వహణ కార్యక్రమాలు చూడమని నిర్దేశింపగా ఆయన కూడా భక్తిప్రవృత్తులతో సుమారు 400 ఎకరాలు మాన్యం ప్రతీ సంవత్సరం వెయ్యి నాణేలు రొక్కం స్వామి సేవలకు ఇచ్చునట్లు ఏర్పాట్లు గావించెనని చెప్పబడుతోంది కాలగతిన వచ్చిన జమిందారులు కూడా పెక్కు అగ్రహారాలు ఈ దేవాలయానికిచ్చి తమ భక్తిప్రవృత్తులు వెల్లడించుకున్నారు

## క్షేత్ర విశేషాలు

మూడు ప్రాకారాలతో (అంతస్తులు) సువిశాలమైన ఆవరణలో నిర్మింపబడిన ఈ ఆలయం భక్తులకు కావలసిన మానసిక ప్రశాంతత చిత్తశుద్ధి కల్గిస్తోంది ప్రాకారములన్నింటిలోనూ ఏకాదశ లింగములు ప్రతిష్ఠింపబడినవి

మొదటి ప్రాకారములో ప్రణవేశ్వరుడు కాశీ విశ్వేశ్వరుడు ఉమామహేశ్వరుడు దత్తాత్రేయ స్వామి రుద్ర పాదములు జ్వాలాముఖీదేవి అగస్త్యేశ్వరుడు పార్థివేశ్వరుడు సోమేశ్వరుడు నాగేశ్వరుడు కోసలేశ్వరుడు వీరభద్రుడు ఆలయములు కళ్యాణ మండపం కృష్ణానదికి త్రోవ నెలకొల్పబడినవి

రెండవ ప్రాకారములో విమేశ్వరుడు కాలభైరవుడు కుమారస్వామి అంజనేయస్వామి ఆలయములు నవగ్రహ మండపం నిర్మింపబడినవి

మూడవ ప్రాకారంలో నైఋతి దిక్కున శ్రీశైల మల్లేశ్వరుడు వాయువ్య దిశన కాశీ విశ్వేశ్వరుడు ఈశాన్యమున చండీశ్వరుడు ఆగ్నేయమున శ్రీకాళహస్తీశ్వరుడు తూర్పున శ్రీ సూర్య భగవానుని ఆలయములు గలవు

శివకేశవ భేద నిరూపణకన్నట్లు క్షేత్రపాలకునిగా శ్రీ వేణు గోపాలస్వామి ప్రతిష్ఠింపబడి యుండుట విశేషం

గర్భగుడిలో శ్రీ బాల చాముండేశ్వరి ఆలయ కూడా కలదు సుమారు పది అడుగుల ఎత్తు కలిగిన స్ఫటిక వర్ణపు శివలింగాన్ని అర్చకులు ప్రక్కనే నిర్మించిన మెట్లపై నిలబడి లింగాభిషేకం గావిస్తారు

## ఉత్సవ రోజులు

మహాశివరాత్రికి జరిగే బ్రహ్మోత్సవం దసర రోజులలో జరిగే చండీకళ్యాణం ఈ క్షేత్రంలో పేరెన్నిక గన్న ఉత్సవాలు ఉత్సవ రోజులు కార్తీక మాసంలోనూ లక్షలాది భక్తులు పలు ప్రాంతాల నుండి విచ్చేసి స్వామిని సేవించి తరిస్తారు ప్రతీ రోజూ వందలకొలది భక్తులు వివిధ ప్రాంతాల నుండి వస్తారు

ప్రస్తుతం ఎండోమెంట్సు వారి సంరక్షణలో అభివృద్ధి నొందుతున్న ఈ దేవాలయం ఏటా సుమారు లక్షాఏభై వేలు రాబడి పొందుతోంది కృష్ణా పుష్కరాలకు సుమారు తొమ్మిది లక్షల రూపాయల వ్యయంతో పుష్కర ఘాట్ గాలి గోపురం నిర్మింపబడ్డాయి

అందమయిన ప్రశాంత ప్రకృతి ఒడిలో నెలకొనియున్న ఈ క్షేత్రం సినిమా షూటింగ్‌లకు ఎక్స్‌కర్షన్లకు కూడా ఆకర్షించి అలరారుతోంది

గుంటూరు విజయవాడల నుండి విరివిగ రవాణా సౌకర్యం వుంది భక్తులు పర్యాటకులకు విశ్రాంతి గృహాలు సత్రాలు అందుబాటులో వున్నాయి ఇక్కడ గల ఆర్కియోలాజికల్ వారి బౌద్ధ మ్యూజియం కూడా వీక్షింపదగిన మందిరమే

వ్యాసం ఫోటో —

—సీతమర్తి ఆదిలక్ష్మి ప్రసాద్



నూతనముగా నిర్మింపబడిన గాలిగోపురం

ఆఖరి అంతస్తులో అమరిన అమరేశ్వరాలయం

పుణ్య కృష్ణవేణి



# ఆ క్షణం జరిగింది

సోమిరెడ్డి జమున

"డాక్టరుగారు రౌండ్స్ కొస్తున్నారు ఎంత హడావుడిగా స్పెషల్ రూమ్‌లో కడుగుపెట్టిందో అంత హడావుడిగానే వెళ్ళిపోయింది నైట్ నర్స్

అర్చనా! అరుందతి కంఠం చాల బలహీనంగా వుంది

పది రోజుల నుండి జ్వరం వస్తుంటే అదే తగ్గిపోతుందని ప్రక్క వూర్లో వున్న కూతురికి కబురుపెట్టలేదామె

అదేంటి మమ్మీ? అని అర్చన అడిగితే కొత్తగా పెళ్ళయిన జంట మిమ్మల్ని డిస్టర్బ్ చేయాలని పించలేదండి

ఎవ్వరూ తోడులేని తన తల్లి తన సుఖాన్ని డిస్టర్బ్ చేయకూడదనుకున్నదంటే తల్చుకున్న అర్చన కళ్ళల్లో నీళ్ళు నిండిపోయాయి తల్లికి కన్పించకుండా వరండాలో కెళ్ళి కళ్ళు తుడుచుకుంటున్న అర్చనకు అమ్మ తనని పిలవడం- వెంటనే రౌండ్స్ కొస్తున్న డాక్టర్ మహేష్ అరె మీ కళ్ళల్లో నీళ్ళేమిటి? అని అడగడం ఒకేసారి జరిగిపోయాయి

కంట్లో నలక పడ్డట్టుంది డాక్టరుగారూ! త్వరత్వరగా రూమ్‌లోకి అడుగుపెట్టి ఓ ప్రక్కగా నిల్చుని అంది అర్చన

ఏమైందర్చనా? చాలా ఆదుర్దాగా లేచింది అరుందతి

ఆ అమ్మాయి కేమీ అవలేదు మీరు మంచంమీద నుండి కదలొద్దు ప్లీజ్ చాలా సున్నితంగా పేషెంటుని వారించి అరుందతి పల్స్ చూసాడు డాక్టర్ మహేష్

యిప్పుడెలా వుంది డాక్టరుగారూ! కలత చెందిన మనస్సుతో అడిగింది అర్చన

వర్రీ అవాల్సిన పనేం లేదు పది రోజుల్లో ఆవిడకు పూర్తిగా తగ్గిపోతుంది పది రోజుల నుండి జ్వరం వస్తుంటే ఎలా నెగ్లెట్ చేసారు? అరుందతి చార్ట్ చూస్తూ అడిగాడు

నేను మా అత్తగారింట్లో వున్నాను నాకు మా మమ్మికి జ్వరమని ఈ రోజే తెలిసింది

ప్రిస్క్రిప్షన్ వ్రాస్తున్న డాక్టర్ మహేష్ తల ఎత్తి సంశయంగా అర్చనను అడిగాడు

మీరు అరుందతి డాటరా? అతని కళ్ళనిండా ఆశ్చర్యం ఎందుకో తన పేషెంటుకు పెళ్ళయిన కూతురుంది అంటే అతనికి నమ్మశక్యం కావడం లేదు ఒక్కమారు నిశితంగా అరుందతి వైపు చూసాడు

చక్కని కను ముక్కు తీరులో పసిమిఛాయతో ఇరవై అయిదేళ్ళ అమ్మాయిలా వున్న అరుంధతిని అలా చూడ్డం సభ్యతా సంస్కారానికి విరుద్ధం అని

తో చగానే తన కలవరపాటుని కప్పిపుచ్చుకుని,

ఈ మెడిసిన్స్ తెప్పించి నా దగ్గరకు పంపండి ఎప్పు డెలా వాడాలో చెప్తాను అని ప్రిస్క్రిప్షన్ కాగితం అర్చన కందించి అరుంధతి వైపు తిరిగి

మీరు మాత్రం బెడ్ దిగ కూడదు మీకు జాండిస్ ఎటాక్ అయింది మా మందులు నామ మాత్రమే మెయిన్ ట్రీట్‌మెంట్ మీరు రెస్ట్ తీసుకోవాలి

★ ★ ★ ★

ఒ పి పేషెంట్లను చూడ్డంలో మునిగిపోయిన డాక్టర్ మహేష్ ఎక్స్‌క్యూజ్‌మి డాక్టరు గారూ! అన్న అర్చన పిలుపుతో తల తిప్పి కూర్చోండి అని ప్రక్కనే వున్న కుర్చీ చూపించి తన ఎదురుగా నిల్చొనున్న ఆఖరు పేషెంటును చూసి పంపేసి

ఇలా ఇవ్వండి అని మందుల ప్యాకెట్ అందుకున్నాడు

మీ మదర్ వయస్సెంత?

ముప్పై నాలుగు!

ఒ కె యీ మెడిసిన్స్ ప్రొద్దున- సాయింత్రం వాడండి ఇంజక్షన్ ఒకటి వ్రాయడం మర్చిపోయాను! మీ ఫాదర్‌ని పంపండి యధాలాపంగా అని లేచి నిల్చున్నాడు

మా ఫాదర్ చనిపోయి పది సంవత్సరాలయింది ప్రొద్దుటి నుండి కలతబారిన మనస్సుతో వున్న అర్చన కళ్ళల్లో మరలా కన్నీటి పొరలు

ఐ యామ్ వెరీ సారీ అమ్మా నాకు తెలియదు మీ మనస్సు కష్టపెట్టి నట్లున్నాను అతని మనస్సు చిత్రంగా భారమయింది

నేనెళ్తాను డాక్టరుగారూ!

మా కాంపౌండర్‌తో నేనా యింజక్షన్ తెప్పిస్తాను నీవెళ్ళమ్మా అర్చనా '

క్యాంటిన్ కెళ్దామని లేచి నిల్చున్న డాక్టర్ మహేష్ మరలా కూర్చుండి పోయాడు అతని మనస్సులో అరుంధతి రూపం మెదిలింది అమె నుదుట బొట్టు లేదనేది ఇప్పుడే స్ఫురించింది ఇరవై నాలుగేళ్ళకే అమె జీవితంలో ఎంత పెద్ద అపశృతి- ఆ

## ఆ క్షణం జారింది

శాపగ్రస్థురాల్ని తనతో పోల్చుకున్నాడు ముప్పయి అయిదేళ్ళయినా ఇంకా తన జీవితంలో పెళ్ళి-- సంసారం అనే బంధాలే లేవు ఇప్పటివరకు తన చదువు- అదయ్యాక తన వృత్తిలో రాణింపు ఇదే -ఇదే తన అనుభవాలు- పెళ్ళి చేసుకుంటే ఎలాటి అమ్మాయిని చేసుకోవాలా? అనే తీయని ఊహలతో గడిపే తను పుట్టినప్పటికి యీ భూమ్మీదే లేని ప్రాణి అరుందతి అలాటి అమె జీవితం తీపి గుర్తులను నెమరు వేసుకోవడంతో తవ జీవితాన్ని నెట్టే యాలి ఎంత విచిత్రం-

డాక్టరు గారూ! తేలు కుట్టిందంట నానా హంగామా చేస్తున్నాడు లోపలికి పిలవనా నర్స్ మాటలతో యీ లోకంలోకి వచ్చి రమ్మను అన్నాడు అతని మనసు అలా స్పందించడం అతనికే వింతగా అన్పించింది

★ ★ ★ ★

నేను లేచి ఆ కుర్చీలో కూర్చుంటాను యీ బెడ్‌షీట్ విదిలించేయి మంచం దిగి నిల్చుంది అరుంధతి

చెప్పిన మాట వినడం లేదన్న మాట మీరు చిరునవ్వుతో లోపలి కడుగు బెట్టాడు మహేష్

మీరు రౌండ్స్ కొచ్చేసరికి రూమంతా నీట్‌గా వుండాలని మామమ్మీ తాపత్రయం నవ్వుతూ జవాబిచ్చింది అర్చన

అరుంవతి పల్స్ చూడ్డానికి ఆమె చెయ్యి పట్టుకుంటే ఆమె స్పర్శతో అతని శరీరంలోని ప్రతి అణువులో విద్యుత్ ప్రవహిస్తోంది ఆమె గుండెమీద స్టెతస్కోప్ పెట్టిన మహేష్ గుండె వింత అనుభూతితో స్పందిస్తోంది

"చార్ట్‌లో బి పి ఎంత నోట్ చేయమంటారు డాక్టరు గారూ" అని నర్స్ అడిగితే చెప్పలేకపోయాడు అతను చూసిన బి పి రీడింగ్ మరుగున పడిపోయి అరుందతి రూపం ముద్రించుకుని పోయింది డాక్టర్ మహేష్ మదిలో

★ ★ ★ ★

ఏదో ఆలోచిస్తూ కూర్చున్న అరుందతి రౌండ్స్ కొచ్చే సమయంకాని సమయంలో ఎదురుగా చిరునవ్వుతో నిల్చొనున్న డాక్టర్ మహేష్‌ను చూసి తత్తరపాటుతో లేచి నిల్చుంది

మిమ్మల్ని రేపు డిస్చార్జి చేస్తున్నాను

హమ్మయ్య యీ పది రోజులు బాగా బోర్ కొట్టేసింది తన తత్తరపాటుకు నవ్వుకుని తేలిగ్గా నిట్టూర్చి అంది

మా హాస్పిటల్‌లో బోర్ కొట్టిందా? మీకు తోచకుంటే వెయిటింగ్ హాల్‌లో లైబ్రరీ వుంది మెయిన్ హాల్‌లో టి వి వుంది

ఏమిటో వేటిమీదా యింటరెస్ట్ వుండదు అరుందతి చాలా మామూలుగా అన్నా మహేష్‌కా మాటల్లో ఎన్నో అర్థాలు బోధపడ్డాయి

అర్చనెక్కడ?

తల స్నానం చేసొస్తా నని యింటి కెళ్ళింది వచ్చే టైం అయింది

మీ కభ్యంతరం లేకుంటే మీతో పది నిముషాలు మాట్లాడా లనుకుంటున్నాను

కూర్చోండి డాక్టరు గారూ! ఆమె మనస్సు నిండా బయం

మీ జీవితాన్ని ఇలాగే గడపాలను కుంటున్నారా? సూటిగా అడిగాడు

పది సంవత్సరాలు భర్తవిహీనగా వున్న అరుందతికి అతని మాటల కర్థం చప్పున బోధపడింది ఆమె ముఖం మ్లానమయింది కంఠం మూగవోయింది

మీ మనస్సు కష్టపెట్టాలని నేననుకోవడం లేదు

అరుందతి తలెత్తింది ఈ పది రోజుల్లో డాక్టర్ మహేష్ ప్రవర్తనలో ఏ కొద్దిపాటి అసభ్యత తొంగి చూడక పోయినా అతను తనమీద చూపించే శ్రద్ధను మాత్రం పరిశీలిస్తూనే వుందామె




నా మనస్సు మీరు కష్టపెట్టకపోయినా దానికి అది అలవాటయి పోయింది డాక్టరు గారూ!

అలా ఎందుకనుకోవాలి! కష్టపెట్టుకునే మనస్సుకు మీరు సుఖపెట్టడం నేర్పొచ్చుగా?

ఎలా? ఆమెకి సంబాషణ అప్రియంగా వుంది కానీ ఆ సంబాషణ ఎలా త్రుంచాలో తెలియడం లేదు

మీ రెందుకు మరలా పెళ్ళి చేసుకో కూడదు? మీ పర్సనల్ జీవితంలోకి నేనొచ్చి యిలా ప్రశ్నించడం మీకు చికాగ్గా వుండొచ్చు కానీ కానీ ఎందుకో మీరంటే నా కభిమానం ఎర్పడింది ఇలాటి అభిమానాలు మనిషికి మనిషికి మధ్య ఎందు కేర్పడుతాయో నన్నడిగితే చెప్పలేననుకొండి

ఆమె కళ్ళెత్తి అతని వైపు చూసింది- అతని కళ్ళు ఆమె కళ్ళతో మాట్లాడాయి- చప్పున కళ్ళు వాల్చేసుకుంది

నా కూతురికి పెళ్ళయిందని మీకు తెలుసు! ఆ

VVD

ఊహాలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎన్నెన్నో
అల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి.వి.డి. కొబ్బరి నూనె



VVD-3/86




# వి.వి.డి. కొబ్బరి నూనె

*సహజ శిరోజాల యౌవన రహస్యం*

V.V.D

మాట లనేసి నిశ్శబ్దంగా కూర్చుంది

మి వయస్సు ముప్పై నాలుగేననీ నాకు తెలుసు!

బయాశ్చర్య సందేహాలు ముప్పిరిగొన్న బావమేదో తళుక్కున మెరిసి రెండు అశుకణాల రూపంలో క్రిందకు జారాయి

మీ మనస్సు కష్టపెడ్తే నన్ను క్షమించండి!

వంచిన తల అడ్డంగా వూపి అంది

మీరు నా ఎడల చూపిస్తున్న అబిమానానికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయంతే!

"మీ కభ్యంతరం లేకపోతే మిమ్మల్ని నేను పెళ్లి చేసుకుంటాను

అరుందతి యీ మాటకు స్థాణువై పోలేదు యీ పది రోజులుగా అతను తనమీద చూపించే శ్రద్ధకు అర్థం యీ రోజు సంబాషణలో అతని నోటివెంట ఇలాంటి మాట వస్తుందని ఆశిస్తూనే వుంది దానికి జవాబు కూడా ఆమె దగ్గర సిద్ధంగానే వుంది

మీలాటి మంచిమనసున్న వ్యక్తికి నాలాటి బార్య శాపం రూపంలో రాకూడదు

నేను మిమ్మల్ని నా జీవితంలోకి ఆహ్వానించడం అదృష్టంగా బావిస్తున్నాను కానీ శాపంగా కాదు అతనికి ఆమె నోటి వెంట అంగికారం తెల్సితే వినాలనిపిస్తోంది

ఒక్కక్షణం ఆమె మనస్సు పరవశించింది అంతే మరుక్షణం జీవితంలో ఎన్నో ఎదురు దెబ్బలు తిన్న ఆమె మనస్సు కుంచించుకుంది

నేను జీవితంలో సుఖపడాలి అనుకునేకంటే యీ సంఘంలో ఏ ఆటుపోట్లూ తగలకుండా ప్రశాంతంగా గడపాలను కుంటున్నాను

అంటే? అర్థంకాక అడిగాడు

మిమ్మల్ని పెళ్ళి చేసుకుని మీ చల్లని నీడలో సేద తీరగలను అని అనుకునే కంటే యీ సంఘం చేసే విమర్శలను క్రూర చూపులను తట్టుకోలేనని పిస్తోంది బేలగా అంది

మీ జీవితం మీది- మీ సుఖం మీది అలాటప్పుడు యీ సంఘం ప్రబావం మీ మీద ఎలాపడుతుందో ఆలోచించడం అనవసర మంటాను

అనవసరం కాదు డాక్టరు గారూ! చాలా చాలా అవసరం పెళ్ళయిన నా కూతురిమీద నా పెళ్ళి ప్రబావం చాలా వుంటుంది అర్చన నావల్ల దాని అత్తగారింట్లో అపహాస్యాలు పాలయితే నేనిక్కడ సుఖంగా వుండలేను ఇంకా ఇంకా చెప్పాలంటే మీరిప్పుడు నామీద జాలితో తాత్కాలిక ఆవేశంతో నన్ను చేసుకోవచ్చు కానీ మీకు సంఘంలో ఒక మంచి డాక్టరుగా గుర్తింపు వుంది నన్ను చేసుకున్న తర్వాత నా ద్వారాకానీ అర్చన ద్వారా కానీ మీ మనస్సు అశాంతి పాలైతే

అరుందతిని మధ్యలోనే ఆపి ఆవేశంగా అన్నాడు డాక్టర్ మహేష్

నో అలా ఎప్పటికీ మీరనుకోవద్దు మీ వల్లగానీ- అర్చన వల్లగానీ నా మనస్సు గాయపడదు కారణం మీరిద్దరూ నా

## కాలమా ...

కాలమా—
షష్ఠిపూర్తికి దగ్గరయినా
ఇంకా అహంకారమా?!
జవసత్వాలుడిగి
కామక్రోద లోబ మోహాలు
నశించి పోయే సమయాన
కోడె నాగులా
జాతి మత కుల వర్ణాలనే
వాడి కరకు కోరలతో
విజృంబించి
మానవ మారణ హోమం
ప్రళయ తాండవం
సృజించి
బీబత్సం బయానకం
దావానలం కురిపిస్తావా!
ఆపు నీ దౌష్ట్యం
ఇకనైనా ఆపు నీ క్రోదం
చేయకు జీవ క్షయం
కాలమా
శాంతించు శాంతించు
మమకారాన్ని పెంచు
అదిగో
ఆ వచ్చేదే ప్రబవ
అది తెచ్చేను విబవం

- సత్యశ్రీ

## ఆ క్షణం జారింది

వాళ్ళవుతారు నా జీవితంలో మీరొక బాగమైతే మీ ద్వారా అర్చన కూడా నాకు ఆప్తురాలవుతుంది శాంతినయినా అశాంతినయినా యిద్దరం కలిసే అనుబవిద్దాం ప్లీజ్ ఇవన్నీ ఒద్దు నన్ను చేసుకోవడం మీ కిష్టమా? కాదా చెప్పండి?

నేను చాలా పిరికిదాన్ని డాక్టరుగారూ! మీ ఈ ఆహ్వానాన్ని తిరస్కరిస్తున్నందుకు నన్ను క్షమించండి రెండు చేతులెత్తి అతనికి నమస్కరించింది దైన్యంగా

మీరు బాగా ఆలోచించుకోండి ఆమె నమస్కరించిన ఆమె రెండు చేతుల్ని పట్టుకుని క్రిందకు దించేసి బారంగా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు

* * * *

నువ్వు తీసుకున్న నిర్ణయం నాకేమి నచ్చలేదు మమ్మీ!

రెండు కళ్ళకూ తన చేతులు అడ్డం పెట్టుకుని పడుకుని వున్న అరుందతి ఉలిక్కిపడింది

నేనంతా విన్నాను పదహారేళ్ళ అర్చన చాలా గంబీరంగా అంది

చిన్న పిల్లవు నీకు తెలియదులే అర్చనా!

అవును మమ్మీ! నాకు నీ గురించి ఏమి తెలియదు గంటలు గంటలు శూన్యంలోకి చూస్తూ గడిపేసే మా అమ్మ ఎలా వుంటుందో నాకు తెలియదు- పసుపు- కుంకుమలకు నోచుకోక ఎ శుబకార్యాలకు వెళ్ళలేక నిర్జీవంగా యింట్లో గడిపే అమ్మ నాకు తెలియదు- కూతుర్ని అత్తగారింటికి పంపేసి ఏ తోడూ లేకుండా ఒంటరిగా వుండే అమ్మకు ఒక తోడు అవసరమనీ నాకు తెలియదు- తన బాదను తనలోనే యిముడ్చుకునే అమ్మ బాద నాకు తెలియదు

వెక్కి వెక్కి ఏడ్చేసింది అర్చన

ఏడుస్తున్న అర్చన కళ్ళు తుడిచి తన బుజంమీద అర్చన తల వాల్చుకుంది అరుందతి

డాక్టరుగారు చాలా మంచివారు ప్లీజ్ మమ్మీ! ఎవరో ఏదో అనుకుంటారనే శంకతో పిరికితనంతో నీ జీవితాన్ని మాడ్చేసుకోకు ఒప్పుకో మమ్మీ! ఆశగా తల్లివైపు చూసింది

నాకే కోరికా లేదమ్మా! వున్నదల్లా ఒకటే కోర్కె! ఏ అప్రతిష్ఠా లేకుండా అరుంధతమ్మ మంచిది అని అన్పించుకుంటే చాలు తల్లీ!

నిజం చెప్పు మమ్మీ! నీకు సుఖపడాలని లేదూ! అందరిలా నీకూ ఒక తోడు కావాలన్పించడం లేదూ! ముఖ్యంగా పసుపు- కుంకుమలతో కళకళలాడాలని లేదూ! తల్లిని నిలదీసింది అర్చన

అందరికీ అన్ని ఆశలూ- కోరికలూ వుంటాయమ్మా కానీ కొందరు వాటికి దూరంగా శాపగ్రస్థులుగా వుంటారు వాళ్ళల్లో నేనూ ఒకదాన్ని! నో! మమ్మీ నేను ఆ మెట్ట వేదాంతాన్ని ఒప్పుకోను నీకు మంచి జీవితాన్ని ప్రసాదిస్తానంటూ ముందు కొచ్చిన వ్యక్తితో నీ వెందుకు సుఖపడ కూడదు?

ఆ సుఖం వెనుక ఎవరో ఏదో నా గురించే అనుకుంటారేమో! అని తల్చుకుంటేనే బయంతో నా శరీరం వణికిపోతోంది ఇక నేను నా జీవితంలో నిజంగా నా వెనుక అనుకునే మాటలు విని బరించలేనులే అర్చనా!

ఎవరో ఏదో అనుకుంటే మనకేం మమ్మీ!

ఎవరో ఎందుకు? రేపు మీ అత్తగారింట్లో మీ అమ్మకిప్పుడు పెళ్ళి కావలసి వచ్చిందా? అని అవాకులు - చవాకులు మాట్లాడుతారనుకో! నువ్వు విని బరించగలవా?

ఐ డోంట్‌కేర్ మమ్మీ! ఎవరి జీవితం వాళ్ళది ఈ రోజు నువ్వింతగా కుమిలి పోతున్నావ్? నీతో పాటు వాళ్ళు ఏడుస్తున్నారా? చెప్పు మమ్మీ?

అర్చనను గుండెలకు హత్తుకుని అంది

చాలు తల్లీ! నా కోసం- నా సుఖంకోసం ఆరాటపడే వాళ్ళు నా వెనుక వున్నారనుకుంటే ఆ ఆనందమే నాకు చాలు?

* * * *

బొమ్మలా నడిచి వచ్చి ఎదురుగా కూర్చున్న అర్చనను చూసి అరుందతి హృదయం అగ్నిగోళమయింది

విది చేతిలో కీలు బొమ్మలమంటే ఇదే కాబోలు- తల్లికి తోడవసరమని బోదించిన అర్చన జీవితం

ఒక్క సంవత్సరం కాలం తిరిగేసరికి ఆమెను తోడులేనిదాన్నిగా చేసి యాక్సిడెంట్‌లో చనిపోయాడు అర్చన భర్త

బండరాయిగా మారిన అరుందతి గుండె అర్చన పసుపు- కుంకుమలు పోగొట్టు కోవడంతో కరిగి నీరయి పోయింది తన బ్రతుకు ఎలా వున్నా- కూతురు జీవితం ఎలా గడుస్తుందా? అనే ఆలోచనతో- యాతనతో- ప్రతిక్షణమూ కుమిలి పోతోంది- అవిరామంగా ఏడుస్తోంది

★ ★ ★ ★

ఎప్పుడూ నిరాసక్తంగా గడిపే అరుంధతికి తోడు అర్చన జోడయింది ఏమీ తోచని అర్చన బి ఏ మొదటి సంవత్సరంలో చేరింది అర్చన కాలేజికి వెళ్ళి రావడంతో- అర్చన స్నేహితురాళ్ళు ఆ ఇంటి గడప ఎక్కి దిగడంతో ఆ ఇంటికి కొద్దిగా జీవకళ వచ్చింది- మూడు క్యాలెండర్లు చినిగిపోయాయి

★ ★ ★ ★

మమ్మీ మమ్మల్ని ఆశీర్వదించు అర్చన సంపత్‌తో కలిసి వచ్చి అరుందతి కాళ్ళకు నమస్కారం చేస్తుంటే అయోమయంగా ఇద్దర్నీ లేవదీసింది- సంపత్ ఆమెకు కొత్త వాడేమి కాదు అరుందతి తోడికోడలు తమ్ముడు అర్చన చదివే కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తున్నాడు

మీరు పెళ్ళి చేసుకున్నారా? వాళ్ళిద్దరి వైపు చూస్తూ అడిగింది

అవునక్కా! మీకు చెప్తే మీ పిరికి తనంతో- అనవసర బయాలతో అర్చన జీవితాన్ని ఇలాగే వుంచేస్తారనే బయంతో చెప్పకుండా చేసుకున్నాం క్షమించు సంపత్ అర్చన చేయి పట్టుకుని చెప్పాడు

వాసంతక్కకి! బావగార్కి తెలుసా? బయంగా అడిగింది అరుందతి

ఇంకా చెప్పలేదు మమ్మీ! ముందు నీ ఆశీర్వాదం తీసుకుని తర్వాత వాళ్ళ దగ్గరకు వెళ్దామనుకున్నాము

కూతురు ధైర్యంగా వున్నా అరుందతి బయంతో బిగుసుకు పోయింది- అర్చన జీవితం సుఖ శాంతులతో వర్ధిల్లితే అలా అనుకుంటే చాలా ఆనందమేసిందామెకు కానీ తన కూతుర్ని తన తోడికోడలు- బావగారు తక్కిన బంధు బలగం ఏమైనా అనుకుంటే అర్చన భరించగలదా? ముందు తను భరించగలదా?

నువ్వూరా అరుందతక్కా! ఎదురుగా నవ్వుతూ నిల్చొనున్న సంపత్- సంపత్ ప్రక్కన నూతనోత్సాహంతో కళ్ళల్లో కోటి వెలుగుతో తన ఒక్కగానొక్క కూతురు-

మీరెళ్ళండి బాబూ- నేను తర్వాత వస్తాను!

★ ★ ★ ★

కాలేజీలో ప్రేమించుకున్నారా అరుందతమ్మా అయినా ఏం కాలమో లేమ్మా తల్లికి చెప్పకుండా పెళ్ళి చేసుకుని వచ్చింది మేమంతా యిలాటి అప్రాచ్యపు పనులు ఎరుగమమ్మా ఎదురింటి బామ్మ పనిగట్టుకుని వచ్చి ఆరా తీసినట్టు

వాడు చనిపోయి నాలుగేళ్ళు అయిందో లేదో అప్పుడే నీ కూతురికి పెళ్ళి చేసేసావా? అవున్లే నా పేగు మండిందే కానీ నీ పేగు కాదుగా అర్చన అత్తగారు నిలదీసి అడుగుతున్నట్టు

చూడు అరుందతీ నువ్వేదో మరెచిదాని వనుకున్నాను అలాగే నీ కూతురూ బుద్ధిమంతురాలనుకున్నాను గానీ ఇలా మా తమ్ముడ్ని వలలో వేసుకుంటుందనుకోలేదు తన తోడికోడలు కళ్ళనిండా క్రోదం నింపుకుని ఎదురుగా నిల్చున్నట్టు

మొగుడు చనిపోయిన పిల్లను కాలేజీకి పంపింది అయినా ఆ కుర్రాడు ఇంటికి వస్తూ పోతుంటే ఏమీ తెలియనట్టు వుండిపోయింది ఇదంతా ఓ నాటకంలే తల్లికి తెలియకుండా ఆ పిల్ల యింత పని చేస్తుందా వెనుకచేరి గ్రంథం నడిపిందీవిడ అందరూ యిలా వాఖ్యానిస్తున్నట్టు అరుందతి చెవులు హోరెత్తి పోతున్నాయి ఒళ్ళంతా ముచ్చెమటలు పోస్తున్నాయి ఆమె తల తిరిగిపోతోంది కాళ్ళలో శక్తి నశించిపోయి అక్కడికక్కడే స్పృహ తప్పిపోయింది

★ ★ ★ ★

మమ్మీ

అరుందతక్కా

అరుందతీ!

అరుందతమ్మా

ఎక్కడో ఎవరో పిలుస్తున్నట్టు మెల్లిగా కళ్ళు తెరిచింది ఎదురుగా అర్చన సంపత్ - తన తోడికోడలు వాసంతి ఎదురింటి బామ్మ ప్రక్కింటివాళ్ళు చుట్టుకుని ఆదుర్దాగా చూస్తున్నారు

ఏమైంది మమ్మీ మేమొచ్చేసరికి నీవలా స్పృహలేకుండా పడివుంటే ఎంత బయపడి పోయాను

ఇప్పుడు బావుందా అరుందతీ వాసంతి ప్రసన్నంగా అడిగింది అందరి వైపు వెర్రిగా చూస్తోంది అరుందతి

ఏమిటే అమ్మాయ్! అందర్ని అంత బయ పెట్టేస్తున్నావ్ ఇదిగో చూడు మన అర్చనను ఆ అబ్బాయి పెళ్ళి చేసుకున్నాడు యిలాంటి సంతోష సమయంలో నీకు బాగలేదని అర్చన కళ్ళలో నీళ్ళు పెట్టుకుంటోంది

వాసంతక్కా! సంపత్ అర్చనని పెళ్ళి చేసుకుంటాడని నేననుకోలేదక్కా బయంగా మెల్లిగా అంది అరుందతి

ఇప్పుడేమయింది అరుందతీ! నువ్వింకా పాత కాలంలో వుంటే ఎలా? అర్చనకు పట్టుమని ఇరవై ఏళ్ళు లేవు నీ జీవితంలాగే దాని జీవితమూ శాపగ్రస్థమయింది ఎలాగో సంపత్ మంచి మనస్సుతో అర్చన జీవితంలో వసంతం వచ్చింది దానికి మనము సంతోషించాలి ఈ రోజు మనం పండుగ చేసుకోవాలి మనస్ఫూర్తిగా ఆప్యాయంగా అర్చనను దగ్గరకు తీసుకుని అన్న మాటలకు అరుందతి అర్థంకానట్టు చూసింది

అవునే అమ్మాయి అర్చనను చూస్తే కడుపు తరుక్కుపోయేది ఎదో మా కాలం అలా గడిచిపోయిందా? నీ కాలమూ ఇలా గడిచింది ఇక యీ పసి పిల్ల రాతా ఇంతే కాబోలని వాపోయేదాన్ని






# అనాసక్తి




## ధర్మపథం

ఆప్త బంధువు గతించగా విచారిస్తున్న వారిని ఊరడిస్తూ వారి హితులు ఋణానుబంద రూపేణ పశుపత్ని సుతాదయః, ఋణ క్షయే క్షయం యాంతి కాత్రత్ర పరివేదనా అనే శ్లోకాన్ని ఉదహరిస్తారు భార్యా, బిడ్డలు, పశువులు మొదలైనవి మనకు ఋణం ఉన్నంత కాలం మనతో ఉండడం, ఋణం తీరగానే విడిచి పెట్టి పోవడం సహజం దీనికై బాదపడనక్కర్లేదు- అని దీని అబిప్రాయం

కొన్ని పరిస్థితుల్లో- వైరాగ్యం తాత్కాలికంగా కలిగినా, కొద్ది రోజుల్లోనే సమసిపోతుంది వైరాగ్యం స్థిరంగా నిలిచి వుంటే మానవుడు ఏ పనినీ చేయలేడు నిత్య జీవనం కొనసాగడమె సాధ్యం కాదు

ఆద్యాత్మిక వేత్తలు, జగత్తు మాయ అనీ, పరమాత్మయే సత్యమనీ, దీనిని గ్రహించి లౌకికాల మీద వ్యామోహం చెందకుండా, ఆద్యాత్మికం పైనే దృష్టి నిలపాలనీ బోదించగా, ఆ బోదనలు విన్నంత సేపూ ఆ విషయమే మనస్సుకు పట్టినా, తర్వాత మనస్సు లౌకికాల మీదికే మళ్లిపోతుంది ఇది సర్వ సామాన్యం లౌకికాలయిన కర్మలు చేయకుండా ఎవ్వరూ ఉండలేరు, బోదకుల బోధలు మనస్సులో స్థిరంగా ఉండాలంటే వాటిని మననం చెయ్యడం అవసరం ఒక వైపు సంసార జీవితం గడుపుతూ, మరొకవైపు దర్మచింతన చేస్తూనే ఉండాలి మనం ఏదో సంకల్పంతో కర్మనాచరించినా, అది సపలం కాకపోతే, దాని కోసం ఎక్కువ విచారించకూడదు కర్మ చెయ్యడం మన వంతు పలం దైవాధీనం పలం పయి ఆసక్తి లేనప్పుడు సుఖం కలిగినా, దుఃఖం కలిగినా వ్యక్తి నిర్విచారంగానే ఉంటాడు మనస్సులో ఎట్టి కలతపాటు ఉండదు ధైర్యం చెడదు నిర్లిప్తత కలుగుతుంది ఆసక్తి వుంటేనే- కార్యహాని కలిగినప్పుడు కలతపాటు కలగక తప్పదు కర్మలను ఆచరించడం ధర్మమని భావించి, అనాసక్తితో వానిని నెరవేర్చడానికి ప్రయత్నించవలసి యున్నది

-ఋలుసు వేంకటరమణయ్య

## ఆ క్షణం జారింది

తోడులేని రాత ఎలాటిదో నీకూ బాగా తెలుసు పోనీలే అరుందతమ్మా దేముడిలా ఆ అబ్బాయి నీ బిడ్డను ఆదుకున్నాడు వస్తానే తల్లీ నీవలా స్పృహలేకుండా పడుంటే వదలిపోలేక వున్నాను వెళ్లి సంద దీపం వెలిగించాలి ఎదురింటి బామ్మ తన సంతోషాన్ని బోసి నోట వెళ్ళడించి వెళ్తుంటే అరుందతి నోట మాట రాలేదు

మరుసటి రోజు వాసంతి ఆద్వర్యాన ముఖ్యమైన బందు బలగానికి అర్చన స్నేహితురాళ్ళకు సంపత్ స్నేహితులకు విందు బోజనాలు ఏర్పాటు చేయబడ్డాయి వచ్చిన అతిదులకు అర్చన చేత పసుపు - కుంకుమ లిప్పించింది వాసంతి

అరుందతి బయపడినట్టు ఒక్కరంటే ఒక్కరు ఎదురుగా వచ్చి అర్చన చేసిన పనికి విమర్శించలేదు

సంస్కారవంతులు ముందుకొచ్చి సంపత్‌ని అబినందించి అర్చన జీవితం వెలుగులోకి వచ్చినందుకు తన సంతోషాన్ని ప్రకటించి వెళ్లిపోయారు

* *

అరుంధతి ఒళ్లో పదకొండు నెలల పసిపాప అర్చన సంపత్ అనోన్య దాంపత్యానికి ప్రతిఫలం అమ్మమ్మ మీదకు పాకుతూ - బుగ్గలు తడుముతూ నవ్వుతూ ఏడుస్తూ - ఆ ఇంటిని చైతన్యవంతం చేస్తూ

ఐదేళ్ల క్రితం డాక్టర్ మహేష్ అభ్యర్ధనను తను త్రోసిపుచ్చి వుండకపోతే యీ సమాజం గురించిన అనవసరమైన అపోహలతో అధైర్యంతో వెనుకడుగు వేసుండకపోతే తన ఒడిలో మహేష్ పోలికలతో ఇలాంటి పాపే

తృప్తిపడింది అరుందతి ఏమిటో ఊహలు

ఇంకో రెండు గంటలలో నిశిరాత్రి అయిపోతుంది కళ్ళు మూతలు వేసుకుని కనురెప్పల వెనుక గతించిపోయిన రోజుల్ని లెక్క లేసుకుంటూ పొందిన అనుబూతుల్ని జార్చుకున్న అనుబవాల్ని బేరిజు వేసుకుంటూ స్పృహ వచ్చినప్పుడల్లా వాటిని చెదరగొడూ- మరుక్షణంలో వెనక్కు వెళ్తున్న వర్తమానంలోకి బయంకరంగా ఎదురుపడుతున్న బవిష్యత్తులోకి జారుకుంటూ కనురెప్పల క్రింద నిద్రా దేవిని కప్పెట్టేసి ఏ కోడి కూసే వేళో మనసు అలసి మగతకమ్మితే అదే నిద్ర అనుకుని బ్రమించి పొద్దున్నే లేస్తే ఎదురయ్యే నిరాశను నీరసాన్ని చూస్తూ ఎన్ని రోజులు ఎన్ని నెలలు ఎన్ని సంవత్సరాలు ?

మరోసారి తృప్తిపడింది అరుందతి

సంపత్ కాలేజీ నుండి వస్తాడు అర్చన ఎదురెళ్తుంది ఇద్దరూ వడ్డించుకుంటారు అన్నంతో పాటుతియ్యటి కబుర్లు కలుపుకుని తృప్తిగా తింటారు ఒకరితో ఒకరికి ఒకరి బరోసా మరొకరికి ఒకరి ఆనందం మరొకరికి ఎంత అందమైన జీవితం ఈసారి స్పృహ వచ్చాక తృప్తిపడలేదు అరుందతి తను చేతులారా జార్చుకున్న క్షణానికి బాదపడింది ☐




వారిచే మహిళా లోకానికి

సరిక్రొత్త కానుక.

500 గ్రా రుచికరమైన బాంబినో

వెర్మిసెల్లిని ప్యాకెట్టు ఉచితం.




IS 1485
ISI

నేడే బాంబినో వెర్మిసెల్లిని కొనండి
రుచికరమైన పకోడా, వడ, కట్‌లెట్లు
రుచికరంగా చేసుకొని, ఖా-
ప్యాకెట్లు దాచి వుంచండి
ఎందుకంటే మీరు 11 ఖాళీ 250 గ్రా
ప్యాకెట్లను లేదా 6 ఖాళీ 500 గ్రా
ప్యాకెట్లును డీలరుకు వాపసు ఇస్తే
మీకు 500 గ్రా బాంబినో ప్యాకెట్టు
మా డీలరు ఉచితంగా ఇస్తారు

ఖాళీ ప్యాకెట్లను దాచుకోవడంలో
కూడా ఆనందం ఉంది కదా!




బాంబినో వెర్మిసెల్లిని

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి

గుర్తుంచుకోండి. ఈ సదవకాశం
31-3-86 వరకు మాత్రమే.
ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే.

సీరియల్

# మనసుకు సంకెళ్ళు



ప్రమీలా జనార్దన్

(గత సంచిక తరువాయి)

ప్రతిమ వారం కిందటే మహిళా మండలిలో చేరింది

చుట్టుప్రక్కల వాళ్ళు ఇదివరకే చేరమని అడిగారు

చేరి చేసేదేముంది? అనుకుంది

నాకు పెద్దగా వుత్సాహం లేదు అన్నది వాళ్ళతో

కాని ఈ మధ్య ఒంటరితనం విసుగు పుట్టిస్తోంటే తనే చేరతానని వాళ్ళు ఐ క్యాంప్ నిర్వహించేందుకు చందా కావాలని వచ్చినప్పుడు చెప్పింది

చాలాదెర్యం చేశావే అన్నాడు రవి ఆమె మహిళా మండలిలో చేరాననగానే ప్రతిమ ఇల్లుదాట తనంతతానుగా ఎక్కడికి వెళ్ళదు నలుగురితో గలగల మాట్లాడే స్వబావం కాదామెది

ప్రొద్దున బోజనం చెయ్యగానే ప్రక్కింటికి బైలుదేరింది ప్రతిమ

ఐ క్యాంప్ ఎక్కడ ఎలా ప్రారంబించాలో చర్చించేందుకు మహిళా మడలి సభ్యులంతా అక్కడ చేరుకోవాలనుకున్నారావేళ

ప్రతిమకు వాళ్ళతో తిరగడం మాట్లాడడం బాగానే వుందనిపిస్తోంది ఇంట్లో ఒంటరిగా కూర్చుంటే మనసెటో పోతుంది

తన బ్రతుకేమౌతుందోనని ఆందోళన కలుగుతుందొక్కొక్కసారి

మానసికంగా ఆనందంగా వుంటేనే పుట్టే బిడ్డ ఆరోగ్యంగా వుంటాడు అన్న డాక్టర్ మాటలే ఆమెను మహిళా మండలి వైపు మళ్ళించినట్లున్నాయి

తనెప్పుడో చేరి వుండాల్సింది ఇప్పుడు చేరింది వాళ్ళతో ఎన్ని రోజులు తిరగ్గలదు? ఇరవై రోజులలో పురుడొస్తుందని చెప్పింది డాక్టరమ్మ అనుకుంటూ వస్తున్న ప్రతిమ లోపలి నుండి తన పేరు వినిపించడంతో కర్టెన్ తొలగించబోతూ అలాగే ఆగిపోయింది

డబ్బెంత ముఖ్యమనుకున్నా మరి ఆ రవిగారి బార్యలా మాత్రం అనుకోగూడదు ఎవరో స్త్రీ చిత్కరింపుగా అంటోంది అతడు సుదను ప్రేమించాడని తెలుసట వాళ్ళ ప్రేమను ఒప్పుకునే పెండ్లి చేసుకుందట ఎంతడో

ప్రతిమకు తల తిరిగినట్లయింది రవి సుదను ప్రేమించాడా?

డబ్బుండీ డబ్బు పేద కుటుంబంలో ఎల్లా ఎత్తుగా బుత్తుగా వున్నవాడు దనవంతుడు బర్తగా కలలో తప్ప ఇలలో దొరకడనుకుంది అలాంటి అవకాశం రాగానే విడవకూడదనుకుంది ఇంకొకావిడెవరో తనకంతా తెలిసినట్టు మాట్లాడుతోంది

ఎంత డబ్బు పిచ్చైనా మొగుడు మరొకరితో తిరుగుతానంటే ఒప్పుకోవడమా? అసహ్యంచుకుందో ఇల్లాలు

అతడైనా అలా చేశాడేమిటి? ఒకరు ఆశ్చర్యంగా అంటే ఏం చేస్తాడు? ఆ సుద జబ్బు మనిషి తిరిగేందుకు తప్ప దేనికీ పనికి రాదనుకున్నాడేమో ఇద్దరికీ అడ్డుపడకుండా వుండే అమ్మాయిని చూసి చేసుకున్నాడు మరొకరు వివరించారు

బాగానే వుంది ఇంట్లో ఒకరు బైటికొకరు దినికి అంగికరించిన ఆ మహాతల్లిని మెచ్చుకోవాలి స్త్రీ జాతికే అవమానం కలిగేటట్టు చేసింది ఆమెతో మాట్లాడాలంటేనే తలవంపులుగా వుంటుంది అయినా మనకు కావలసిన డబ్బు పెద్ద మొత్తంలో ఇవ్వగలావిడ ఆవిడగారే కాబట్టి స్నేహం నటించక తప్పదు తెగ బాదపడిపోతూ అన్న ఆమె మాటలు పూర్తి కాక ముందే షటప్ అంటూ కర్టెన్ విదిలింపుగ ప్రక్కకు లాగి లోపలికి వచ్చింది ప్రతిమ

ఎమిట నేను డబ్బుకు ఆశపడ్డానా' ఆమె కండ్లు చింత నిప్పులే అయ్యాయి

అక్కడున్న సభ్యులందరు నిరుత్తరులై చూస్తున్నారు

డబ్బు డబ్బు డబ్బు రెండడుగులు ముందుకు వచ్చింది

డబ్బు కావాలనుకుంటే బర్తను మరొకరితో పంచుకునేందుకు నచ్చఎడక్కర్లేదు అందరి వంక చూసింది

మిలో ఒక్కరు ఒక్కరైనా మంచి మనసుతో ఆలోచించారా' శుష్కహాసం చేసింది

లేదు మిరలా ఆలోచించలేరు మిరు ఆలోచించేది డబ్బు గురించి ఆలోచించగలిగేది గూడా దాని ఒక్కదాన్ని గురించేనేమో అందుకే మికు తలవంపులుగా వున్న నాతో మాట్లాడుతున్నారు మిరా ఈ సమాన్ని ఉద్ధరించేది' మిరా స్త్రీ జాతిని చైతన్యవంతం చేసేది' తోటి స్త్రీని అర్థం చేసుకోలేని మిరు ఎదో ఘనకార్యం చేస్తారా' ఎమి చేయలేరు నాలుగు మాటలు చెప్పి చందాలు వసూలు చేస్తారు వేదిక లెక్కుతారు మిరేదో చేయాలని కాదు పేరు ప్రతిష్టల కోసం ఆరాటపడుతున్నారు నాకా పేరు ప్రతిష్టలు అక్కరలేదు మికు మి సభ్యత్వానికి నమస్కారం అంటూ వెళ్ళబోతూ ఆగి వాళ్ళ వంక చూచి మిరందరూ ఒకటి మాత్రం తెలుసుకోండి నేను మిలా డబ్బుకు కక్కుర్తిపడే మనిషిని కాను నాకు జీవితంకన్నా డబ్బు ఎక్కువకాదు అంది

* * * *

తను ఎం విన్నది' ప్రతిమ ఇంటికి రాగానే మంచంమిద వాలింది

జరిగిన కథ-9 రవి సహకరిస్తే సుదకి మానసిక రుగ్మత పూర్తిగా నయమవుతుందని చెప్తాడు డాక్టర్ రవి అంగికరిస్తాడు సుద చంద్రం స్నేహంగా ఉంటున్నారు సుద తండ్రితో చెప్పి చంద్రంకు ఉద్యోగం ఇప్పిస్తుంది ప్రతిమ గర్భవతయింది ప్రతిమపై సుదకు అసూయా ద్వేషాలు పొంగి పొర్లుతున్నాయి రవికి బార్యంటే పెద్దగా అబిమానం లేదని అతని హృదయంలో ఇప్పటికీ తనకే స్థానం ఉందని ఊహించుకుని తృప్తి పడసాగింది సుద సుదను రవికి మరి సన్నిహితంగా మెలగవద్దని హితబోధ చేస్తాడు చంద్రం

రవి సుద ప్రేమించుకున్నారని తెలిసి తను చేసుకున్నదా? అక్కడి వాళ్ళ మాటలు తలచుకుంటే ఏడుపు వస్తోంది

రవి సుద తన ముందే యదేచ్ఛగా మాట్లాడుకుంటూ తిరుగుతుంటే అతడు ఆమె మీద జాలి పడుతున్నాడనుకుంది తనకు అనుమానమే రాలేదు

రవి తనను చేసుకుంటున్నాడనగా గొప్ప మనసు గలవాడనుకుంది

ఆ గొప్ప మనసు వెనుక కథ ఇది

సుదను అతను ప్రేమించాడు కానీ మతిస్థిమితంలేని ఆమెను చేసుకుంటే కష్టమనుకున్నాడు తనను చేసుకున్నాడు తన పేదరికం కుటుంబ గౌరవం వాళ్ళ గురించి తననేం మాట్లాడనివ్వవనుకున్నాడు తను మూర్ఖురాలు అతడో గొప్ప వ్యక్తి అనుకుంది అతడు చూసే ఆదరణ అభిమానం నటన అని తెలుసుకోలేక పోయింది సుద బోజనానికి వచ్చిననాటి సంఘటన మదిలో మెదిలింది

రవి ఆ రోజు ఆమెను డాన్సు ప్రోగ్రామ్‌కు తీసుకు వెళ్లానని అన్నాడు అదంతా ఆమె ఆరోగ్యం కొసమేనని తనకు అనుమానం రాకుండా కబుర్లు చెప్పాడు ఆమె మీద మమతే లేకపోతే ఆమె ఆరోగ్యం విషయంలో ఎందుకు అతడికంత శ్రద్ధ? రగులుకున్న అనుమానం ఆమె గుండెను మండిస్తోంది

ఆమె ఆమె కోసమే ఆ రోజు డిల్లీకి ఫ్లైట్ టికెట్స్ తీసుకోమని చెప్పి వుంటాడు హనీమూన్ విషయం తలుపుకు వచ్చింది

ఆ మేనేజర్ ఇంటికి ఫోన్ చేయడం వల్ల తనకు తెలిసింది తనకా విషయం తెలియకపోతే రవి సుదను తీసుకుని వెళ్లేవాడు మేనేజర్‌తో సుదను తీసుకెడుతున్నానని చెప్పలేక తన పేరు చెప్పి ఉంటాడు రవి చేసిన ప్రతి పనిలో తప్పే కనిపిస్తోందిప్పుడు

తను ఘోరంగా మోసపోయింది బార్య సంసారం వుంటే ఎవరూ అనుమానించరనుకున్నాడు రవి అంతలో సందేహం సుద తల్లిదండ్రులకీ విషయం తెలియదా? అనుకుంది కానీ వెంటనే అలా అనుకోవడం వెర్రితనమనిపించింది

'లోకమంతా తెలిసింది వాళ్ళకు తెలియదా? రవిని వాళ్ళు అడిగేలోపే రవి పెండ్లి చేసుకుని వుంటాడు సుద అనారోగ్యం వాళ్ళను అటు ఆమెను ఇటు రవిని కూడా ఏమననివ్వలేదేమో' పెండ్లయిన రవి ఆమెతో తిరుగుతున్నాడు గనుక తనున్నా వాళ్ళ అమ్మాయికి ఇంట స్థానం లబిస్తుందని ఆశతో ఉండి వుంటారు

మంచం మీద నుండి లేచింది

వాళ్ళకు డబ్బుంటే తనకు అభిమానం వుంది బర్తను మరొకరితో పంచుకోలేదు తను రవి గుండెలో మరో రూపు వున్నదంటే తనిన్నాళ్ళు ఇక్కడ వుండేదే కాదు ఆవేశంగా ఆలోచిస్తోంది

తనకు మనసుందని రవి అనుకోలేదు డబ్బుతో దాన్ని మూసేసాననుకున్నట్లున్నాడు డబ్బుతో ఏదయినా చేయగలుగుతారేమో మనసును మాత్రం కొనలేరని అతడికి చెప్పాలి బీరువా దగ్గరకి వచ్చి బట్టలు తీసుకుని సూట్‌కేస్‌లో పెట్టుకుంది

పెండ్లిని స్త్రీ పురుషులిద్దరూ పవిత్రంగా బావించాలి ఇందులో స్త్రీకో న్యాయం పురుషుడికో న్యాయంకాదు రవి ఆ న్యాయం కాదనుకున్నాడు ఆ బందానికి కట్టుబడలేదు తనెందుకుండాలిక్కడ? తనలో ఆవేశాన్ని కాగితం మీదపెట్టాలని టేబుల్ ముందు కూర్చుంది

రవీ, మీ డబ్బు హోదా నన్ను నేను మరిచేలా చేస్తాయనుకున్నారు గదూ! కలం తీసుకుంది

పేదరికం మనసును చంపదు మమతను పెంచుతుందని అతడికి తెలపాలి

అతడు వేసిన బందం తనకు అతడి మీద అభిమానం పెంచిందే తప్ప ఆత్మాభిమానాన్ని చంపలేదని చెప్పాలి మనసొకరికి మనుగడ మరొకరితో ఇది సంస్కారవంతులు చెయ్యాల్సిన పనికాదని వ్రాయాలి

ఇంకో పేదింటి పిల్లను తెచ్చి ఆమెనూ లోకం చేత డబ్బు మనిషని అనిపించకండి ఏ పడతీ పతిని పంచుకునేందుకు ఇష్టపడదని హెచ్చరించాలి

మనసు కోరుకున్న మనిషి జీవితంలోకి వస్తేనే మనిషికి సుఖం సుదను చేసుకోండి భార్యలో ఏ లోపం వుండగూడదనుకోడం వివేకం కాదు అయినా నిజమైన ప్రేమ ఏ లోపాన్ని కనిపించనివ్వదు అనుభవానికి ఒకరు ఆనందానికి మరొకరు మీకు న్యాయంగాతోస్తోందా కలం కాగితం మీదపెట్టింది

'రవి' చెప్పకుండా వెళ్ళిపోవాలనుకున్న నేను మీకి లెటర్ వ్రాస్తున్నానంటే అది కేవలం పెండ్లనే బందం వల్లే ఈ బందం లోకం కొసమేనని మీ గుండెలో స్థానంలేదని తెలిశాక నేనిక్కడ వుండలేక పోతున్నాను గుండెలో స్థానం లేకుండా ఇంట్లో స్థానాన్ని కోరుకోలేదు అభిమానం గల స్త్రీ కడుపులో కలుక్కుమనడంతో కలం ఆగిపోయింది

కుర్చీ మీద అలాగే వెనక్కు వాలింది కాని మళ్లీ వెంటనే అదే పోటు

అబ్బ! కుర్చీలో నుండి గంతేసినట్లుగా లేచింది చేతిలో కలం జారిపోయింది

మంచం దగ్గరికి వచ్చి పడుకోవాలన్నా చేత కావడంలేదు కడుపులో బాద నొప్పి నొప్పులేక పోతోంది

కాఫీ ఇచ్చేందుకు వచ్చిన నాయర్ ఆమె అవస్థ చూసి గబగబ క్రిందికి వెళ్లి పనిమనిషిని పంపించాడు

రంగి పైకి వచ్చింది

ప్రతిమ కదలలేని దానిలా కుర్చీ పట్టుకుని ఏడుస్తోంది

పడుకోండమ్మా రంగి సహాయం పట్టి మంచం దగ్గరకు తీసుకొచ్చింది కొద్ది నిముషాలు గడిచినా ఆమె బాధ తగ్గలేదు నొప్పులు వస్తున్నాయని గ్రహించింది రంగి

హాస్పిటల్‌కు వెళ్ళలేము డాక్టరు గారికి పోన్ చెయ్యి నాయర్‌ను పిలిచి చెప్పింది

నాయర్ డాక్టర్‌కు అలాగే రవికి కూడా ఫోన్ చేశారు

రవి ఆపసులో లేడని చెప్పారు

ఆ సమయంలో రవి మోహనరావుతో తన జీవిత సమస్య గురించి మాట్లాడుతున్నాడని ఎవరికీ తెలియదు

* * * *

సుదతో తనిలాగే తిరగడం బాగుండదు ప్రతిమ అనుమానించక పోయినా



# మనసుకు సంకెళ్ళు

[illegible]

సుద వల్ల తనకేదో తక్కువయిందనుకుంటున్నట్లుంది ఆమె ఇదివరకులా ఉత్సాహంగా వుండడం లేదు ఏ స్త్రీ అయినా భర్త మరొక స్త్రీతో తిరుగుతుంటే హర్షించలేదు సుద తనకు దూరం అయ్యేదెలా' ఎన్నాళ్ళగానో ఆలోచిస్తున్న రవికి మార్గమేదో తోచగానే మోహనరావు దగ్గరికి వచ్చాడు

రండి చాలా రోజుల తర్వాత మా ఆఫీసుకు వచ్చారు అతడ్ని చూడగానే అన్నాడు మోహనరావు ఎంతో అవసరమైతే తప్ప రవి ఆఫీసుకు రాడు

మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి కుర్చీలో కూర్చుంటూ అన్నాడు

కొత్త పర్మ్ ఎదయినా పెట్టబోతున్నారా? అడిగాడు మోహనరావు

లేదు ఏదో ఆలోచిస్తున్న వాడిలా అన్నాడు

రావుగారూ మీరు సుదకు తొందరగా పెండ్లి చెయ్యాలి

రవి మెల్లగా అంటూ అతడి ముఖంలోకి చూశాడు

నేను సుదకు పెండ్లి చెయ్యగూడదనుకో లేదని మీకు తెలుసు ఆమెకు పెండ్లి ప్రయత్నాలు చేశాను

ఇప్పుడు గట్టిగా ప్రయత్నించాలి

ప్రయత్నించి లాభమేమిటి? సుద ఒప్పుకోదు

నేను ఒప్పిస్తాను దృఢంగా అన్నాడు రవి

ఆమె పెండ్లికి ఒప్పుకోకపోతే మా ఇద్దరి బ్రతుకులకు అర్థమే వుండదు అపనిందలతో అశాంతితో జీవితం గడపాల్సి వస్తుంది

రవి బాదగా చూశాడు

సుద వల్ల మీరూ నింద మోస్తున్నారని తెలుసు కాని సుదకేదైనా చెప్పాలంటే ఏమౌతుందోనని బయం మా స్వార్థ చింతనతో మీకు అశాంతి కలిగించాము క్షమించండి రవీ ఇప్పటికే ఆలస్యమయింది సుద ఎండ్ల చేసుకోనంటే మరో దారి ఏదైనా చూస్తాను ఆమెను మీకిక సమస్యగా వుండనివ్వను వుద్వేగంగా అన్నాడు అప్పటికప్పుడు సుదనెక్కడికైనా తీసుకెళ్ళి పెంచి రావాలనిపించింది అతడికి

రవి అనడమే కాదు సుద అతడితో తిరగడం తండ్రిగా తనూ భరించలేక పోతున్నాడు కాని ఏం చెయ్యగలడు? దేనికీ తట్టుకోలేని దౌర్భాగ్యురాలు సుద గాజుబొమ్మలా చూసుకోవాలి

తన మాటలు అతడికి బాద కలిగించాయని అతడి వదనం చూసి తెలుసుకున్నాడు రవి

నేను చెప్పేది నా ఒక్కడి కోసం కాదు సుద గురించి కూడా ఆలోచించి చెబుతున్నాను

నాకు తెలుసు రవీ మీరు సుదను ఏదో అన్నారనుకోవడం లేదు నేను

సుద నాకు సమస్యగా వుందని మీరు తొందరపాటు నిర్ణయం తీసుకోకండి ఆమె దారి సుగమంగా వుంటేనే మనకు శాంతి అని చెప్పి ఆ విషయం గురించి అతడ్ని తీవ్రంగా ఆలోచించనివ్వకుండా ఆఫీసు విషయాలలోకి దిగాడు రవి

రవి ఆఫీసుకు రాగానే చెప్పారు ఇంటినుండి పోన్ వచ్చిందని

ప్రతిమ డెలివరి కాగానే మళ్ళీ నాయర్ పోన్ చేశాడు బాబుగారు రాగానే కొడుకు పుట్టాడని చెప్పండి అని

రవి ఆ వార్త వినగానే తన రూమ్‌లోకి కూడా వెళ్ళలేదు బైటికివచ్చి కారెక్కాడు

ప్రతిమకు ఇప్పుడే డెలివరి కాదన్నారు డాక్టర్లు బాబు ఎలా వున్నాడో! తను మోహనరావుగారి దగ్గరికి వెళ్ళకుండా వుంటే ముందుగా ఇంట్లో వుండేవాడు అక్కడ ఆలస్యమయింది తను సమయానికి రానందుకు బాదగా వుందతడికి

డాక్టర్లు పురుడింకా ఇరవై రోజుల తర్వాత వస్తుందని చెప్పడంవల్ల పదిరోజుల తర్వాత కోడల్ని పంపిస్తానని చెప్పాడు ఎరందామయ్య



చివరికి ఎవరూ లేకుండానే జరిగిపోయింది

ప్రతిమా మెట్లెక్కుతూనే పిలుస్తూ గదిలోకి వచ్చాడు

అతడ్ని చూడగానే పనిమనిషి క్రిందికి వెళ్ళిపోయింది

బాబు ఎలా వున్నాడు? ప్రతిమ దగ్గరికి వచ్చాడు రవి

ప్రతిమ పలకలేదు

ఏమిటిది? డాక్టర్లిప్పుడే కాన్పుకాదన్నారు అతడి మాట పూర్తి కాకముందే ఏం ఎప్పుడైతే మీకేమిటి? మీకేం ఇబ్బందిలేదుగా! మీరు మీకు కావల్సిన వాళ్ళ దగ్గరికి వెళ్ళారు వుక్రోషంగా అంది ప్రతిమ

ప్రతిమా స్థబ్దుడయ్యాడు రవి

ఏమిటి నువ్వంటున్నది?

వున్నమాటే! మీకు కావల్సింది సుద అక్కడికే వెళ్ళండి వుండండి

ప్రతిమా

మీ మాటలతో నన్నింక మోసం చెయ్యలేరు

మోసమా ప్రతిమ ఎందుకలా మాట్లాడుతోందో అర్థం కావడంలేదతడికి

మీరు సుదను ప్రేమించారు ఆవేశం ఆమెకా సమయంలో గూడా శక్తి నిచ్చినట్లుంది ప్రతిమ గొంతు ఖంగ్ మంటుంటే అప్పుడే వచ్చి మెట్లెక్కుతున్న సుద చెవులను సోకాయా మాటలు

పెండ్లి చేసుకొనేందుకు ఆమె పిచ్చి అడ్డువచ్చింది మీకు

ప్రతిమా గర్జించాడు రవి

నువ్వు స్పృహలో వుండే మాట్లాడుతున్నావా? ఆవేశాన్ని అణుచుకోవాలనేమో క్షణం ఆగి అన్నాడు సుధకు పిచ్చి అని నేను పెండ్లి చేసుకోలేదా? ఎవరు చెప్పారు నీకు?

ఎవరో చెప్పేకాని తెలుసుకో లేననుకున్నారా?

లేదు కండ్లుండి చూడలేని దానివయ్యావంటున్నాను సుదకు పిచ్చికాదు మానసిక బలహీనత అతడి మాటలకు సుద హృదయం పొంగిపోయింది

రవి తన నెవరే చిన్నమాట అన్నా భరించలేడు మెల్లగావచ్చి గదిగోడ నానుకొని నిల్చుంది రవి తన నెందుకు చేసుకోలేదో తెలుసుకోవాలని ఆత్రంగా వుందామెకు రవి కోసం ఆఫీసుకు వెళితే తెలిసింది అతడికి కొడుకు పుట్టాడని చూడాలని వచ్చింది

నేను సుదను చేసుకోవాలంటే కాదనే వారెవరూలేరు రవి గొంతు మంద్రస్థాయిలో పలికింది

తెలుసు విసురుగా అంది ప్రతిమ కాదనుకుంది మీరే పిచ్చిదాన్ని చేసుకోడం ఇష్టంలేక పోయింది

కాదు కాదు కాదు సుద పిచ్చిదికాదు నేను ఆమెను చేసుకోక పోవడం ఆమె పిచ్చిదనికాదు అనారోగ్యవంతురాలనీ కాదు

సుద ఒక అడుగు ముందుకు వేసి చెవి నిక్కించింది

మీరు సుదను ప్రేమించలేదా? ప్రతిమలో కోపం ఏ మాత్రం తగ్గలేదు

అలా అంటే అది అబద్ధమే అవుతుంది నీరస స్వరాన అన్నాడు

నేను సుదను ప్రేమించాను

రవి కలవరంగా అనుకుంది సుద

తనను ప్రేమించినట్లు భార్యకు చెప్పడమా! అతడి జీవితం ఎమవుతుంది? అనుకున్న మరుక్షణమే అంతరాత్మ నిలదీసింది

నువ్వేనా అలా అనుకుంటున్నావు? అతడు నిన్ను ప్రేమించినట్లు ఆమెకు తెలియాలని నువ్వు కోరుకోలేదూ?

సుదకు మతిపోయినట్లే అనిపించింది

ప్రతిమ తనను చూసి అసూయ పడాలనుకుంది దాని ఫలితం గురించి మాత్రం ఆలోచించలేదు

సుద తత్వం మొదటే తెలిసి వుంటే ఇలా అయ్యేదికాదు రవి మాటలు వినిపిస్తున్నాయి

ఆమె మనసెదగని మనిషి ఆస్తి అంతస్తులకు సాంప్రదాయాలకు గూడా ప్రాముఖ్యత నిస్తుంది ఆమె నా జీవితంలోకి రావాలంటే నా గురించి ఆమెకు తెలియగూడదు కాని ఎదో ఒక రోజు ఆ చరిత్ర తెలియక మానదు ఆ రోజు ఆమె

# మనసుకు సంకెళ్ళు

నన్ను అసహ్యించుకుంటుంది. మోసం చేశానంటుంది. దానితో మా సంసార స్వప్నం చెదిరి పోతుంది. ఆవేశావేదనలకు తట్టుకోలేని ఆమె హాస్పిటల్లో..... నేను ఇంట్లో కుమిలి పోయే రోజు అప్పుడూ వచ్చేవే..."

"రవి తన నెలా అర్థం చేసుకున్నాడు!" చకితురాలయింది సుధ.

"ప్రతిమా! నువ్వెప్పుడో ఇలా అడుగుతావని తెలుసు. కాని ఆ రోజు ఇంత తొందరలో వస్తుందని అనుకోలేదు" రవి మంచం ప్రక్కనున్న కుర్చీమీద కూర్చుంటూ అన్నాడు.

"సుధను నేను చేసుకోని కారణం ఆమె నా తల్లి దండ్రులను దోషులుగా పరిగణించడం...."

చిత్రంగా చూసింది ప్రతిమ. "మీ తల్లిదండ్రులు ఆమెకు తెలుసా?"

పేలవంగా నవ్వాడు రవి. "తెలియదు. ఆమె అన్నది లాయర్ ఆనందరావు గారిని. ఆయన చేపట్టిన రెండవ భార్య.... ఆమె చీడపురుగుగా భావించే ఆ ఇల్లాలు నా తల్లి అని ఆమెకు తెలియదు...."

గోడ కవతలవున్న సుధ అవాక్కయిపోయింది.

"తనకు తెలియకుండానే తనే తన జీవితాన్ని నిరాశలోకి నెట్టుకుంది. ఆ రోజు.... తనకు బాగా గుర్తుంది. రవి ప్రేమను వెల్లడించే అవకాశం కల్పించాలనుకుంది..." మనోపథంలో గతం గిర్రున తిరిగింది.

మోహనరావు ఆఫీసు నుండి వస్తూ రెండు ఫోటోలు తెచ్చాడు.

అప్పుడు రవి అక్కడే వున్నాడు.

"చూడమ్మా. వీళ్ళలో నీ కెవరు నచ్చారు?" అంటూ ఫోటోలు సుధ కిచ్చాడు.

మొదటి ఫోటో చూస్తుండగా, "అతడు లెక్చరర్. ఆస్తిపాస్తులు లేవు. కాని అబ్బాయి చాలా బాగుంటాడు...." ఆ సంబంధం గురించి చెప్పాడు.

సుధ పెదవి విరిచింది.

"అంతస్తు లేనివాడ్ని చేసుకోను డాడీ!" ఆ ఫోటో ప్రక్కన పెట్టి క్రింది ఫోటో చూసింది.

"ఈ అబ్బాయి ఎవరో కాదు, లాయర్ ఆనందరావుగారి కొడుకు. ఇంజనీరు..." తండ్రి అంటుండగానే, "ఆనందరావుగారి కొడుకు అంటున్నారు. అంటే అతడు వుద్ధరించాలంటూ చేసుకున్నావిడ కొడుకా?" అంది సుధ వ్యంగ్యంగా.

"కాదమ్మా. మొదటి భార్య కొడుకు. బుద్ధిమంతుడు."

"అతడెలాంటి వాడైనా నాకక్కర్లేదు డాడీ. అలా వేలెత్తి చూపబడే వారింట అడుగు పెట్టలేను."

"సుధా...." ఆలోచించమన్నట్లుగా అన్నాడు మోహనరావు. కూతురు మెంటల్‌షాక్ నుండి తేరుకొని—ఇంటికి వచ్చాక ఆమె పునర్జన్మ ఎత్తినట్లుగా వుందతడికి. తొందరగా పెండ్లి చేసి ఆమెకు మళ్ళీ దాన్ని గురించి ఆలోచనరాకుండా చెయ్యాలని అతడి వుద్దేశ్యం.

రవి అక్కడే వున్నాడు కాబట్టి అతడు అతడి మనసు విప్పుతాడనుకున్నాడు. "తనెలాగూ అతడ్ని సుధను చేసుకుంటారా?" అని అడగలేదు.

సుధ చేతిలో ఫోటో తండ్రి కివ్వబోతుంటే రవి తీసుకున్నాడు.

"ఏం! ఇతడు నీకు నిజంగా నచ్చలేదా?" ఫోటో వంక చూస్తూ అన్నాడు రవి.

అతడు ఆ ఫోటోను పరిశీలనగా చూస్తున్నట్లున్నాడు. "అబ్బాయి బాగున్నాడు."

"నేను అతడు బాగా లేదనడం లేదు. అతడెంత బాగున్నా ఎంత గొప్ప వుద్యోగంలో వున్నా అతడి తండ్రి చర్యతో అతడి వంశమే అప్రదిష్టపాలయింది." చిరాకు పడుతూ అంది సుధ.

రవి ఆ పెండ్లి కొడుకు గురించి మాట్లాడడం ఆమెకు నచ్చలేదు. "అతడి మనసు బైటపెట్టడేం?"

"అతడి తండ్రి తప్పు అతడి తప్పుకాదు...." రవి నచ్చ చెప్పబోయాడు.

"కాకపోవచ్చు. కాని అలా అందరూ వింతగా చెప్పుకొనే వారింట అడుగు పెట్టడ మెందుకు?"

సుధను కొత్తగా చూస్తున్నట్లుగా చూశాడు రవి.

చదువుకొని సభ్యత సంస్కారం గల కుటుంబంలో వున్న సుధ అలా ఆలోచిస్తుందని అనుకోలేదతడు.

"సుధా...." మోహనరావు అన్నాడు.... "అతడి తండ్రి ఏం చేసినా అతడిప్పుడు లేడు.

"అయితే...." సుధ కోపంగా చూసింది.

"మీరు ఇతడ్నే కాదు. ఆయన కట్టుకున్న ఆ మహాతల్లి కొడుకునైనా చేసుకోమని చెబుతారేమో... వితంతువు నుద్ధరించాలంటూ చేసుకున్నాడని ఆ ఆనందరావుగారి గురించి అందరు కథలు కథలుగా చెప్పుకుంటుంటే వింటూనే వున్నాము. ఆ చేసుకున్నావిడ ఎంత జాణో! భార్యా పిల్లలున్నవాడే కనిపించాడావిడకు. అలాంటి వాళ్ళు సంఘానికి చీడపురుగులు డాడీ.... వాళ్ళు వున్నా లేకున్నా వాళ్ళు చేసిన పనివల్ల వచ్చిన మచ్చ మాసిపోదు. వాళ్ళను ఆదర్శంగా తీసుకొని బ్రతుకులు నాశనం చేసుకొనే వాళ్ళు గూడా వుంటారు. వాళ్ళ గురించి వింటుంటేనే నా కసహ్యం. వారింట కోడలిగా ఎలా వెళ్ళగలను?" ఎన్నడూ అలాంటి విషయాల గురించి ఆలోచించని ఆమె ఆ రోజు రవి తను ఆ సంబంధాలను ఒప్పుకోదని ఖచ్చితంగా తెలుసుకోవాలని మాట్లాడిన మాటలు—అతడి గుండెలో శూలాలే అయ్యాయని తెలుసుకోలేదు.

(ఇంకా ఉంది)









**కె. ఆర్., సిరిపూర్**

నాకు 54 సంవత్సరములు. కొన్ని సంవత్సరముల నుండి 6 నెలలకు 4 నెలలకు నిద్రలో మూత్రము చేయుచున్నట్టు కల వచ్చి నిజముగానే జరిగి పక్క చెడిపోవును. ఇది నాకెంతో బాధ కలిగించును. కారణం, నివారణోపాయం తెలుపగలరు.

మానసిక రుగ్మత వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది అరుదుగా వెన్నెముకలోని కొన్ని మార్పు వల్ల పెద్దలలో ఈ లక్షణం ఏర్పడే అవకాశం ఉంటుంది. మీరు ఆర్థోపీడిక్ సర్జన్లనీ యూరాలజిస్టులనీ కలండి.

**యం. డి. జె., గుడ్లవల్లేరు**

నా వయస్సు 17 సంవత్సరములు. సుమారు 2 సంవత్సరముల నుండి నా కళ్లకు వస్తువులు రెండుగా కనపడుచున్నవి. ఇట్లు కనపడినపుడు. నా కుడి కన్ను కుడి వైపునకు కాని, ఎడమకన్ను ఎడమ వైపునకు గాని జరుగుతున్నట్లు గ్రహించాను. అలా కన్ను జరిగి రెండుగా కనబడునపుడు కంటి రెప్ప వేయగానే కన్ను కరెక్ట్ పొజిషన్‌లోకి వచ్చేసి మామూలుగా కనపడును. మరల కొంతసేపటికి కన్ను జరిగి వస్తువులు రెండుగా కనపడును.

మీరు వెంటనే నిపుణులైన నేత్రవైద్యులను సంప్రదించండి

**బి. వి. యస్., పిఠాపురం**

వేసెక్టమీ, ట్యూబెక్టమీ జరిగిన తర్వాతతిరిగి సంతానం కావాలంటే పొందవచ్చా? నాకు ఒక బిడ్డ వుండేది. తరువాత వేసెక్టమీ చేయించినాను యిప్పుడు బిడ్డ పోయినది. సంతానం కావాలని కోరికగా వుంది.

రీకెనలైజేషన్ చెయ్యకలిగిన అవకాశం ఉన్నా అది విజయవంతం అవుతుందని నిర్ధారణగా చెప్పలేము. స్త్రీ-పురుషులిరువురూ అంగీకరిస్తే కృత్రిమ పద్ధతులు ద్వారా సంతానప్రాప్తి కలుగవచ్చును.

**ఆర్. ఆర్., లక్ష్మీనరసాపురం**

నా వయస్సు 40 సంవత్సరములు. 10 సంవత్సరములు క్రితమే నా తల పూర్తిగా తెల్లబడినది. యిప్పుడు నా కనుబొమ్మలు, కనురెప్పలలోని వెంట్రుకలు కూడా తెల్లబడుచున్నవి. అవి తెల్లబడకుండా మందు చెప్పండి.

తెల్లబడకుండా ఆపటానికి ప్రత్యేకమైన మందులేవీ లేవు

**జి. వి. యన్., కొత్తగుడెం**

నా వక్షోజ ప్రాంతంలో రెండు వైపులా గడ్డలు బయలుదేరాయి.నేను షర్ట్ వేసుకుంటే ఉబ్బెత్తుగా కనపడుతూ ఎబ్బెట్టుగా ఉంటున్నాయి. ఇలా అసలు మగవారికి అవుతాయంటారా? ఇవి తగ్గటానికి ఏవైనా మందులు ఉన్నాయా ఎలా వాడాలి. శస్త్రచికిత్స తప్పదా?

దీనిని గైనకోమాస్టియా అని అంటారు. హార్మోనుల ప్రభావం వల్ల ఇలా పెరుగుతాయి. చూడడానికి అసహ్యంగా ఉన్నప్పుడు శస్త్రచికిత్స ద్వారా తీసివేసే వీలు ఉంది. □

# భరతమాతగుండె పగిలింది

తమిరిశ జానకి

నాయుడు గారింట్లో జూ లీ బౌ మంది గేటు తీసుకుని వొస్తున్న రావుల్ని చూస్తూనే ఆ ఇంటికి వొచ్చే వాళ్ళందరూ నాయుడుగారి కిచ్చినంత గౌరవమూ దానికీ ఇవ్వవలసిందే

ఆ కుక్కకి భయపడుతూ వొంగి వొంగి సలాము చేస్తున్నంత వినయంగా దాని వైపు చూస్తూ ఒక్కొక్క అడుగే ముందు కేశాడు రావులు అది కట్టేసి ఉందన్న ధైర్యమే వాడిని అడుగులు ముందుకి వెయ్యనిచ్చింది

బౌ బౌ మంటూనే ఉంది అది నాయుడిగారి ఉప్పు తిన్న విశ్వాసంతో

జూ లీ ఎస్వీ రంగారావు గొంతులా ఖంగుమంది లోపల్నించి ఓ కంఠం ఆ వెంటనే దాని తాలూకు ఆకారం, చిరంజీవి హెయిర్ కట్టూ కృష్ణంరాజు మీస కట్టూ శోభన్‌బాబు పంచె కట్టూ కమల్‌హాసన్ కమీజు కట్టూ శరత్‌బాబు కళ్ళజోడు ఫ్రేము కట్టూతో రజనీకాంత్‌లా సిగరెట్టు నోట్లోకి విసురుకుంటూ బాగ్యరాజ్‌లా ఓర చూపులు చూసుకుంటూ, కాదల్‌మన్నన్ జెమినీ స్మైల్‌తో, నడిగర్ తిలకం శివాజీ హుందాతనంతో మొత్తమ్మీద రంగనాథ్ పర్సనాల్టీతో రంగమ్మీదకొచ్చింది

ఆ శాల్తీయే రంగబాబు నాయుడుగారు వయసెంతో లేదు ముప్ఫయి అయిదే కానీ ఉంది ఆస్తి మూడు నాలుగు తరాలు తిన్నా తరగనిది తండ్రీ తాత ముత్తాతలు కూడబెట్టింది అర్థబలం అంగబలమే కాదు కావల్సినంత పొగరూ పట్టలేనంత గర్వం ఆ ఊళ్ళో తనేం చేసినా చెల్లిపోతుందన్న తిమ్మిరితో కూడిన ధైర్యం కూడా ఉన్నాయి నాయుడికి అతనికుంది అంతస్తు అతనికుంది మూడు లక్షలు కట్నంగా తెచ్చి మొగుడంటే దేవుడే అని నమ్ముకున్న కట్టుకున్న వాడు కండ కావరంతో కంఠం పిసికినా సరే నాలిక వెళ్ళబెట్టాలే తప్ప నోట్లోంచి మాట రాకూడదని తాను ఈడేరక ముందు నించీ నాయనమ్మ చేత పారాలు వినీవినీ వ్యక్తిత్వమంటే ఎరగని ఓ ప్రాణం ఉన్న భార్య అనే బొమ్మ

ఎవరు నువ్వు? ఏం కావాలి? యజమాని గొంతులో చిరాకు కనిపెట్టి యదాశక్తి తనుకూడా ఆ వొచ్చిన వ్యక్తి మీద అధికారం దర్పం చూపిస్తూ మళ్ళీ బౌమంది జూలీ రావులి వైపు తిరిగి

భయం భయంగా చేతులు కట్టుకు నిలబడ్డ రావులు అతివినయంగా జవాబిచ్చాడు సింహస్వప్నంలాంటి నాయుడుగారికి ఆయనగారి గ్రామ సింహానికి కంబైన్డ్‌గా అయ్! నేను రావుల్నండీ అయ్ ఇక్కడ మీకాడ బట్టలుతికే కొండాలమ్మ మా ఇంటిదండీ అయ్ మా పిల్లగాడికి అదాత్తుగా వొంతులై పోతున్నాయండీ పిల్లాడి పేనం కడగట్టి పోతా ఉందండీ నీర్సంతో ఆసుపత్రికే తీసుకుపోతదో ఇంటోనే ఎదన్నా మందునూరి పోస్తదో ఓసారి చూసుకుంటొదని పిలుచుకుపోదామనొచ్చానండీ ఇక్కడున్నట్టు మల్లా వొచ్చేస్తదండీ అయిదు నిముసాల్లో... ఒక్కసారి పిల్లగాడు అమ్మే కావాలని ఏడుస్తున్నాడండీ

నీ శేవన్నా మతిపోయిందా? కసురుకున్నాడు నాయుడు సిగరెట్టు బూడిద మటుకు సుతారంగా దులిపాడు

అయ్ చేతులు మరింత గట్టిగా బిగించి కట్టాడు రావులు



* * * *

నేనభిమానించే నటీనటుల్లో జయసుధ ఒకరు ఆమెకు నటనాపరంగా సలహాలివ్వటమంటే చందమామకు వెన్నెల గురించి వివరించినట్లవుతుంది అయితే ఒక్కోసారి చందమామ అందించే వెన్నెలను అవరోధిస్తూ మేఘాలు అడ్డు వస్తుంటాయి! ఆ మేఘాల అడ్డు తొలగినప్పుడు తిరిగి వెన్నెల తన గుర్తింపును తాను పొందుతుంది

గతంలో ఎన్నో చిత్రాలలో పలు రకాల పాత్రలను చేపట్టి అద్భుతమైన నటనను ప్రదర్శించి తనకి తానే సాటనిపించుకున్న జయసుధ యిటీవల నటిస్తున్న చిత్రాలలోని పాత్రలు ప్రాధాన్యతను కోల్పోయి పేలవంగా ఉంటున్నాయి బహుశ 'తప్పించుకోలేని పరిస్థితుల వల్ల ఆమె ఆ పాత్రలను అంగీకరిస్తున్నట్లు భావించవలసి వస్తోంది ఆమె నటిస్తున్న చిత్రాల సంఖ్య గత సంవత్సరంలో గణనీయంగా పెరిగింది కాని ఆమె



మీదున్న ప్రేక్షకుల అభిమానాన్ని పెంచటానికి ఏమాత్రం తోడ్పడలేదు!

ఆమెలో ఈ మధ్య గమనించదగ్గ లోపం ఏమిటంటే డైట్ కంట్రోల్ పేరుతో పాక్షికంగా నిరాహార దీక్షావ్రతాన్ని పాటించడం వల్ల కాబోలు తన సహజత్వాన్ని కోల్పోవడం జరుగుతోంది అలాగే నీరసించిన శరీరంతో నటించడం వల్ల నటనాపరంగా ఎన్నో భావాలను అందించవలసిన ఆమె కళ్ళు నిగ్రహించుకుంటున్న నిరుత్సాహాన్ని బహిర్గతం చేస్తున్నాయి ఆమె వెంటనే యిటువంటి చిన్న చిన్న లోపాలను సరిదిద్దుకుని చక్కటి కథా వస్తువుగల చిత్రాలను ఎన్నుకొని నటిస్తుంటే ఆమె మరికొంత కాలంపాటు తన ప్రతిభను నిరూపించుకొంటూ ప్రేక్షకుల అభిమానానికి మరింత చేరువ కాగలదని నిస్సంకోచంగా చెప్పవచ్చు

– ఎ చాయానాద్, సౌభాగ్యనగర్, హైదరాబాద్

* * * * * *

డైనమిక్ హీరో చిరంజీవి నా అభిమాన నటుడు అతను నటించిన చిత్రాలు చాలా వరకు చూస్తూ వుంటాను అతి కొద్దికాలంలోనే అగ్రనటుల



లిస్టులలో చేరిన నటుడు. స్టెప్స్ వేయడంలో, ఫైట్స్ చేయడంలో నేర్పరి అయిన చిరంజీవిలో గత కొద్ది కాలంగా కొన్ని లోపాలు కనిపిస్తున్నాయి. ఒక అభిమానిగా అతనికిచ్చే సలహా ఏమిటంటే వెరైటీ పాత్రల్లో నటించమని ఏ విషయంలోనూ అతి పనికి రాదన్నట్లు ఎప్పుడూ ఒక నటుడ్ని ఒకే తరహా పాత్రలో చూడటమంటే ప్రేక్షకులకు విసుగ్గా వుంటుంది అలాగే నటనలో కూడా ఈమధ్య కొంత నిర్లక్ష్యం కనపరుస్తున్నారు చిరంజీవిగారు అలాగాక పాత్రల విషయంలోనూ నటన విషయంలోనూ యింకాస్త శ్రద్ధ వహించ వలసిందిగా చిరంజీవి గారికి ఒక అభిమానిగా సలహా యిస్తున్నాను అలా చేస్తే నాలుగు కాలాలు పాటు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో చిరంజీవిగారు తిరుగులేని హీరోగా రాణించగలరని నా ఉద్దేశ్యం

–కోపూరి రవికుమార్ చెంచుపేట, తెనాలి

* * * *

శ్రీ శోభన్‌బాబు పాత్రలు పేదింటి వాడుగా కుటుంబములోని పెద్దగా, తనే అన్ని బాధ్యతలు



స్వీకరిస్తూ ఒక కార్మిక యువకునిగా ఉండి తన ఇంటివారి సుఖాలను తన శాయశక్తులతో కష్టపడి తరుస్తూ అందరిని సంతోష పెట్టే పద్ధతిలో ఉండాలి మరియు తల్లిదండ్రుల పాలిటి తనయుడిగా చెల్లెళ్ల తమ్ముళ్ళ పాలిట స్నేహితుడిగా కష్టాలలో ఉన్న వారికి ఆత్మీయుడిగా పేదల పాలిటి పెన్నిధిగా దుర్మార్గుల పాలిట రావణునిగా సహధర్మచారిణికి దైవముగా ఉండాలని అందరి ప్రశంసలు అందుకోవాలని నా అభిప్రాయము

-డి లక్ష్మి, మార్కాపురం. □

## మనవి

అభిమాన తారలపై అభిప్రాయం శీర్షికకి రాసేవారు తమ రచనలని పావుతావు సైజు పేజికి (500 అక్షరాలు) మించకుండా కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాసి పంపాలి. రచనలతో పాటు తమ పాస్‌పోర్ట్ సైజు ఫొటో జతపరచి పంపాలి ప్రచురణకి స్వీకరించని వాటిని తిప్పి పంపకోరేవారు తమ రచనలతో పాటు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాకల కవరు జతపరిచి పంపాలి వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకి అవకాశం లేదు ఈ శీర్షికకి రాసే పాఠకులు తమ రచనలని ఫొటోలని సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక గాంధీనగరం విజయవాడ- 520003 అన్న చిరునామాకి పంపుతూ కవరుమీద అభిమాన తారలపై అభిప్రాయం శీర్షికకి అని స్పష్టంగా రాయాలి

– సంపాదకుడు

## విడుదలకు సిద్ధమవుతున్న

## ఖైదీ నాగమ్మ

నాయికగా మాధవి రెండు వైవిధ్యమున్న పాత్రల్లో శరత్‌బాబు సంభ్రమాశ్చర్యాలు కలిగించే రీతిలో నటించారు అన్నారు ఎ చంద్రశేఖరరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో విజయ రాఘవేంద్ర మూవీస్ అధినేత సహదేవ వెంకటేశ్వరరావు నిర్మించిన పై చిత్రంలో ఈశ్వరరావు వేలు సాక్షి రంగారావు రాజశేఖరరెడ్డి ఎలోన్ మనోహర్ రవివర్మ డి ఎ రాజా జె ఎ జయశ్రీ జయవిజయ అనూరాధ షహద మహిజ లక్ష్మి విజయలక్ష్మితో పాటు సర్పం ఎద్దు మర్కటం కూడా పాల్గొన్నాయి పూసల సంభాషణలు వేటూరి అప్పలాచార్య గీతాలు రాజ్ కోటి సంగీతం ఎన్ ఎస్ రాజు ఛాయ లీలాకృష్ణ శిల్పం వేమూరి రవి కూర్పుతో కె ధ్రువకుమార్ నిర్మాణ సారథి

## దాసరి దర్శకత్వలో కృష్ణ

## విశ్వనాద నాయకుడు గా 70 ఎం ఎం

## స్టీరియోఫొనిక్ సౌండ్‌లో

## విజయమాధవీ వారి భారీ చిత్రం

సెంటిమెంట్ కి ప్రాధాన్యత ఉన్న చారిత్రాత్మకం

# సినిమా

## విశేషాలు -జివిజి

సబ్జెక్ట్ రీత్యా ఈ చిత్రానికి అన్నిటా భారీతనం అవసరం భారీ చిత్ర నిర్మాతలు విజయమాధవీ ఎక్స్‌పోర్ట్స్ వారు మరింత భారీగా నిర్మిస్తున్న ఈ చిత్రానికి సంగ్రామ సన్నివేశాలను ఇదివరకెన్నడూ కనీ వినీ ఎరుగని రీతిలో చిత్రీకరిస్తాం శ్రీకృష్ణదేవరాయల సంస్థానంలో వృత్తి ధర్మానికి వ్యక్తిగత బంధాలకు మధ్య చిక్కుకుని చివరికి కర్తవ్య నిర్వహణకే ప్రాధాన్యత ఇచ్చిన సర్వ విద్యాపారంగతుడు యోధాను యోధుడు అయిన విశ్వనాథ నాయకుడి గురించి విజయనగర సామ్రాజ్య చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది ఎన్నో చారిత్రక గ్రంథాలు పరిశోధించి ఆబాలగోపాలాన్ని ఆకట్టుకొనేలా రూపొందిస్తున్నాం ఫిబ్రవరి 4 నుంచి 10 వరకు మొదటి షెడ్యూల్‌ను అన్నపూర్ణా స్టూడియోలో పూర్తి చేశాం మార్చి ఏప్రిల్ మే నెలల్లో 1 10 తేదిల మధ జూన్ జూలై నెలల్లో 1 15 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు దాసరి నారాయణరావు ఈయన దర్శకత్వంలో వడే రమేష్ నిర్మిస్తున్న పై చిత్రంలో ఎత్మ భక్తి కన్నా దేశ శ్రేయస్సే ప్రధానమని భావించిన విశ్వనాద నాయకుడుగా కృష్ణ శ్రీకృష్ణదేవరాయలుగా కృష్ణంరాజు విశ్వనాద నాయకుని తండ్రి నాగమ నాయకుడుగా శివాజీ గణేశన్ తల్లి లలితాంబగా శారద తిమ్మప్పగా మోహన్‌బాబు రాజగురువు పుత్రుడు లక్ష్మీనారాయణగా రామకృష్ణ తిమ్మరుసుగా ప్రభాకరరెడ్డి అల్లసాని పెద నగా జె వి సోమయాజులు తంజావూరు రాజుగా కాంతారావు మదుర రాజుగా త్యాగరాజు రాజనర్తకి కళావతిగా జయప్రద ఇంకా రాజసులోచన అన్నపూర్ణ నిర్మల రమాప్రభ మున్నగువారు పాల్గొంటున్నారు కొండముది శ్రీరామచంద్రమూర్తి సమకూర్చిన కథకు కొండవీటి వెంకటకవి సంభాషణల కర్త ఎ నారాయణరెడ్డి గీతాలకు జె వి రాఘవులు స్వరకర్త వి ఎస్ ఆర్ స్వామి ఛాయ భాస్కరరాజు శిల్పం శీను తార నృత్యాలు వీరుదేవగన్ సాహసాలతో దురా నాగేశ్వరరావు నందం హరిశ్చంద్రరావు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్లు నిర్వహణ వడే కిశోర్ సమర్పణ వడే శోభనాద్రి ✱

## ఇదే నా న్యాయం

నా నటనా సామర్థ్యాన్ని ప్రదర్శించడానికి అనువైన లాయర్ పాత్ర దొరికింది నా ఇమేజ్‌ని





పెంచే చిత్రాలలో ఇదొకటి అన్నారు భానుచందర్ ఈయన సరసన రజని నాయికగా తయారైన కనిష్కా క్రియేషన్స్ వారి పై చిత్రానికి మల్లాది వెంకటకృష్ణమూర్తి నవల దర్మయుద్ధం ఆదారం స్పెన్సర్స్ కంపెని వారి కాంప్లెక్స్‌లో షూటింగ్ జరుపుకున్న తొలి చిత్రమిది అక్కడ నాయికా నాయకుల మీద ఒక పాటను పిక్చరైజ్ చేశాం సదా రద్దీగా ఉండే మౌంట్‌రోడ్‌లో వేగంగా వెళ్తున్న బస్ మీద భానుచందర్‌తో గూండాల ఫైట్‌ను గగుర్పాటు కలిగించే విదంగా చిత్రీకరించాం పతాక సన్నివేశాల చిత్రీకరణలో ఎన్నో సాహసాలు చేశాం పాఠకులను విశేషంగా ఆకట్టుకున్న ఈ నవల ప్రేక్షకులను మరింత ఆకట్టుకుంటుందని రషెస్ చూసినవారు చెప్తుంటే మాకు కలిగిన ఆనందం ఇంతా అంతా కాదు దర్శకుడుగా నాకింతటి చక్కని చిత్రానికి అవకాశమిచ్చిన నిర్మాతలకు ఎంతైనా కృతజ్ఞుడ్ని అన్నారు ఎం నందకుమార్ త్వరలో విడుదలయ్యే ఈ చిత్రంలో జగ్గయ్య గొల్లపూడి మారుతీరావు నూతన్‌ప్రసాద్ వేలు చలపతిరావు , డాక్టర్ శివప్రసాద్ వై జి మహేంద్ర కాంతారావు పూర్ణిమ మాస్టర్ ఆలీ మాస్టర్ గణేశ్ కె వి లక్ష్మి జగ్గు గెస్టులుగా చంద్రమోహన్ మనోచిత్ర అనూరాద నటించారు నిత్యానంద్ మాటలు వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం డి ప్రసాద్‌బాబు చాయ సాయికుమార్ శిల్పం కృష్ణస్వామి బాలు కూర్పు

## సినిమా

సినిమా మొత్తానికి ఇదే డ్రస్సు వుంచుకుంటాను నిర్మాతగారూ' ఎందుకంటే హీరోతోపాటు గెంతుతూ డ్యూయెట్లు పాడటానికి వీలుగా వుంటుంది'



సాహాత్ సాహసాలు శివసుబ్రహ్మణ్యం నృత్యాలు ఎ విశ్వం సహ దర్శకత్వం టి సుదాకరరెడ్డి సహకార దర్శకత్వం జి ఆర్ రాజు ప్రొడక్షన్‌తో జెనర్డ్ టి వి ఎస్ రెడ్డి ఎం ప్రదీప్‌కుమార్ నిర్మాతలు

## మార్చి ప్రధమార్ధంలో

## సురేష్ ప్రొడక్షన్స్ 'ప్రతిధ్వని

డి రామానాయుడు నిర్మించిన చిత్రమంటే ప్రేక్షకులు ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తుంటారు ప్రేక్షకుల అంచనాలను మించేలా తయారైన చిత్రం ప్రతిద్వని కర్తవ్య నిర్వహణకు గృహస్థ దర్మానికి మద్య జరిగే సంఘర్షణను అపురూపంగా రూపొందించిన ఈ చిత్రంలో సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఝాన్సీగా శారద ఆమె బర్త కార్మిక నాయకుడుగా శరత్‌బాబు ఉడుకు రక్తం గల చలాకీ యువకుడుగా అరుజ్జున్ దన మదాందుడైన ఫాక్టరి యజమానిగా నూతన్‌ప్రసాద్ ఇంకా గొల్లపూడి ఎ ఎల్ నారాయణ చలపతిరావు అల్లు రామలింగయ్య రాళ్లపల్లి వేలు మాడా రజని నిర్మల వరలక్ష్మి శ్రీక్ష్మి ఒక ప్రత్యేక పాత్రలో పరుచూరి గోపాలకృష్ణ నటించారు కథ స్క్రీన్‌ప్లే సంబాషణలను పరుచూరి సోదరులు సమకూర్చారు చక్రవర్తి సంగీతం ఎస్ గోపాల్‌రెడ్డి చాయ బాస్కరరాజు శిల్పం బాడోరత్రం



సాహసాలు రఘు నృత్యాలు శై నాగేశ్వరరావు సహకార దర్శకత్వం పొన్నుస్వామి ప్రొడక్షన్ మార్తాండ్ కూర్పుతో బి గోపాల్ దర్శకత్వం వహించారు

## మోహన్‌బాబు ద్విపాత్రాభినయం

## సమర్పణలో మానవుడు దానవుడు

స్కూల్ మాస్టర్ ఉద్యోగం నుండి నేను సినిమారంగానికి వచ్చాను మంచితనం మూర్తీభవించిన స్కూల్ మాస్టర్‌గా కరడుగట్టిన దుర్మార్గుడుగా రెండు పాత్రలు నిర్వహిస్తున్నాను మా గురువు దాసరి నారాయణరావు గారి వద్ద ఎన్నో చిత్రాలకు దర్శకత్వ శాఖలో అనుభవం గడించిన రమణబాబుకి డైరెక్టర్‌గా ఇది తొలి అవకాశం ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటున్నాడు అన్నారు మోహన్‌బాబు ఈయన సమర్పణలో మేడసాని వెంకటాద్రినాయుడు ఎం కృష్ణ నిర్మించే కీర్తి ఆర్ట్ ఎక్సర్స్ వారి పై చిత్రం షూటింగ్ ఫిబ్రవరి 5న మొదలైంది తిరుపతి చిత్తూరు ప్రాంతాలలో ఒకే షెడ్యూల్లో మార్చి 6కి పూర్తవుతుంది రజని నళిని సత్యనారాయణ జె వి సోమయాజులు సారది వేలు విరమాచనేని ప్రసాద్ సంయుక్త



ఉదారవాది అయిన పార్లమెంట్ సభ్యుడు శ్రీ టి సుబ్బరామిరెడ్డి బొంబాయి తాజ్‌లో ఇచ్చిన విందుకు వచ్చిన అతిథులతో శ్రీమతి శ్రీ టి సుబ్బరామిరెడ్డి మీనాక్షిశేషాద్రి స్మితాపాటిల్ శ్రీ డి రామానాయుడు గార్లని చిత్రంలో చూడవచ్చు

జయమాలిని అన్నపూర్ణ తక్కిన నటవర్గం సత్యమూర్తి కథ మాటలు సమకూర్చారు దాసరి ఆత్రేయ గీతాలకు జె వి రాఘవులు బాణీలు కూర్చారు ఎ ఎల్ రాయ్ ఛాయ సూర్యారావు శిల్పం సలీం నృత్యాలు రవిబాబు ప్రొడక్షన్ నాగేశ్వరరావు కనకసేన సహకార దర్శకత్వం ఆత్మాచరణ్ కూర్పు ఇ పురుషోత్తం నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు



# సినిమా



## అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ వారి దొరబిడ్డ

మంచి కథ కోసం ఇంత కాలం ఆగాం ఇది మా అయిదవ చిత్రం మార్చి 1 నుంచి 15 ఏప్రిల్ 6 నుంచి 20 వరకు జరిగే రెండు షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు పండంటి కాపురానికి పన్నెండు సూత్రాలు లాంటి విజయవంతమైన చిత్రాలు నిర్మించిన దగుబాటి భాస్కరరావు ఈయన తాజా చిత్రం దొరబిడ్డ లో రాజశేఖర్ అశ్విని కోట శ్రీనివాసరావు ప్రభాత నటవరం కా

విశ్వనాద్ మాటలు సత్యం సంగీతం చెంగయ ఛాయ రంగారావు శిల్పం మార్తాండ్ కూర్పుతో దవళ సత్యం దర్శకుడు

## సి ఎస్ రావు దర్శకత్వంలో కచ దేవయాని

ఎన్నో పురాణాలు ఇతిహాసాలు పరిశోధించి కథను రూపొందించాను శుక్లాచార్యుని పాత్రకు ప్రాముఖ్యత ఉంటుంది అన్నారు సి ఎస్ రావు బి ఎ (లిట్) ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహించే చంద్రోదయ ఆర్ట్ ఫిలిమ్స్ వారి పై చిత్రంలో కచుడుగా (మల్లెమొగ్గలు హీరో) రామకృష్ణ దేవయానిగా నవనటి సత శుక్లాచార్యుడుగా సత్యనారాయణ ఇతర పాత్రికలను ప్రభాకరరెడి చక్రపాణి కోట శ్రీనివాసరావు నాగరాజు హరిప్రసాదరెడ హరిబాబు రామరాజు సురేంద్ర ప్రభ ముచ్చెర్ల అరుణ భావన నిర్వహిస్తారు సంభాషణలను కొండవీటి వెంకటకవి రాశారు ఆత్రేయ సి హెచ్ సీతారామ శాస్త్రి తాలకు కె వి మహదేవన్ స్వరకర్త నందమూరి మోహనకృష్ణ ఛాయ కె సతీష్ సహకార దర్శకత్వం ఎం నిల్ మల్సాడ్ కూర్పు కె వి ఆర్ మూర్తి నిర్వహణతో ఎ ఎ గోవిందరావు సమర్పకులు మార్చి 20న తలకోనలో షూటింగ్ ప్రారంభమౌతుంది ఏప్రిల్ 10 వరకు ఒకే షెడ్యూల్‌తో ఎనభై శాతంపైగా షూటింగ్ పూర్తవుతుంది జూన్ విడుదల అన్నారు ఎ పరంధామరెడి ఈయన గతంలో మృణాళ్‌సేన్ దర్శకత్వంలో ఒక ఊరికథ చిత్రాన్ని నిర్మించారు ఈయనతో పాటు జగుబాబు కలిసి ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు



## తిరుపతి ప్రాంతాల్లో పవిత్ర

ఇంగెయుం ఒరు గంగై అనే తమిళ హిట్ చిత్రం ఆధారం ఫిబ్రవరి ం నుంచి నెలాఖరు వరకు తిరుపతి పరిసరాలలో షూటింగ్ జరిపాం అన్నారు వినయ్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో బి ఆర్ మోహన్ కె కె విశ్వనాదం నిర్మించే విజయలక్ష్మి ఆర్ట్ క్రియేషన్స్ వారి చిత్రానికి కలైమణి కథ సత్యానంద్ మాటలు కృష్ణ చక్ర సంగీతం శరత్ ఛాయ సత్యం నిర్వహణతో కె వి నర్సయ్య ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ కె ఎల్ ఎన్ రావు నిర్మాత










దర్శకత్వం కె.బాపయ్య సమర్పణ టి వెంకటసుబ్బయ్య బి ఏ నిర్మాత డా॥ డి వి.యస్.రాజు కలర్

కథ మాటలు పరుచూరి బ్రదర్స్ సంగీతం చక్రవర్తి కెమెరా వెంకట్ ఆర్ట్ భాస్కరరాజు ఎడిటింగ్ కోటగిరి వెంకటేశ్వరరావు నిర్వహణ టి అశోక్‌కుమార్

కృష్ణా శ్రీ వెంకటలక్ష్మీ ఫిలింస్, నైజాం శ్రీ వెంకటకృష్ణా ఫిలింస్, సీడెడ్ జయలక్ష్మీ ఫిలింస్,

సీరియల్

ఎస్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

*  *  *  *  *

శృంగార టేబులు దగ్గరకొచ్చి అద్దంలో ముఖం చూసుకుంటుంది మోహిని గుమ్మం దగ్గర అడుగుల చప్పుడయి తల తిప్పి చూసేసరికి జయరాం గదిలో కొచ్చాడు అతను చూసిన చూపుకు క్షణం సేపు ఆమె కళ్ళు సిగ్గుతో వాలిపోయాయి

"నిద్రలేనా వచ్చింది?"

అవును రాగానే దేవిగార్ని దర్శనం చేసుకోవాలనిపించింది ఆమెకు దగ్గరగా వచ్చాడు

అతని చేతులు ఆమె వీపును చుట్టుకున్నాయి ఆమె తల అతని గుండెల మీద వాలింది

పగలూ రాత్రి అని లేకుండా ఏమిటండి ఇది? అంది గునుస్తూ

ఇప్పుడు నా కళ్ళకు ఎలా కనిపిస్తున్నావో తెలుసా'

ఎలా కనిపిస్తున్నాను'

శృంగార దేవతలా

అతని చేతులు ఆమె చుట్టూ మరింత బిగుసుకున్నాయి ఆ క్షణంలో ఆమె పొందు అత్యంత మధురంగా అనిపించింది అతనికి ముద్దులతో మురిపాలతో చిలిపి శృంగారపు చేష్టలతో కొంత ఒప్పుదలతో సిగ్గును పారద్రోలుకుని సిగ్గులు తొలగించుకుని అతనితో పాటు పడక మీద వాలిపోయింది ఆవేశం అనుభవంగా అనుబవం అలసటగా మారింది

అతని మెడ చుట్టూ చేతులు వేసి దగ్గరకు లాక్కుంటూ ఏమండీ! నాదొక కోరిక తీరుస్తారు కదూ? అంది మురిపెంగా

కరిగిపోయాడు ఆమె అందించిన మైకంతో కూడిన పులకరింత పరవశత్వం అతని శరీరం నుంచి ఇంకా పూర్తిగా తొలగిపోలేదు

నీ కోరిక ఎప్పుడు కాదన్నాను? వెనకా ముందూ ఆలోచించకుండా అనేశాడు

మీరు కాదనరని నాకు తెలుసు అతని హృదయానికి మరింతగా హత్తుకుపోయింది

రాత్రుళ్ళు మీరు పక్కన లేకుండా నాకు నిద్రపట్టటం లేదండి

రోజూ నీతోనే ఎక్కువ సమయం గడుపుతున్నాను ఒక్క రోజును కూడా వృధాపోనియ్యకుండా పడక సుఖాన్ని పంచుకుంటున్నాము ఆమె చెవిలో గుస గుస లాడాడు

అదికాదండి రోజూ రెండుసార్లే బొంచెయ్యటం అలవాటన్నట్టు ఒక్క గంటేగా మీరు నాతో గడిపేది ఆ గంట తర్వాత మళ్ళ రాత్రంతా ఒంటరిగా గడపాలి మీరు నారూములోనే పడుకోకూడదూ'

జయరాం నిషాదిగిపోయింది అప్రయత్నంగా అతను ఆమెకు దూరంగా జరిగాడు

మోహినీ! ఇప్పటికి నీకు చాలా సార్లు చెప్పాను స్వప్న దేవత ఇప్పటికే ఆమె నామూలంగా నరకయాతన అనుభవిస్తుంది ఇంకా ఆమెను బాధపెట్టలేను

అన్నిటికీ స్వప్నా స్వప్నా అంటారు ఆమె మీద అంత ప్రేమున్నప్పుడు నన్నెందుకు పెళ్ళిచేసుకోవటం' ఆమెతో ఎనిమిది సంవత్సరాలు సంసారజీవితాన్ని అనుభవించారు నాతో ఏం అనుభవించారు ఈ ఇంటికి దూరంగా ఉన్నప్పుడూ మీరు నాకిచ్చిన టయమ్ గంటే ఈ ఇంటి కొచ్చినా మీ భార్యగా చలామణి అవుతున్నా ఇప్పుడిస్తున్న సమయమూ ఆగంటే నేను మాత్రం మీకు భార్యనుగాదా' నా సుఖాలూ సంతోషాలూ మీతోనేగా ముడిపడిఉంది అంది కోపంగా

నీకు కావలసిన వన్నీ అందిస్తున్నాను నిద్రపోయే సమయంలో ఏ రూములో పడుకుంటే ఏం'

అలా అనుకుని నా బెడ్‌రూములోనే పడుకోవచ్చుగా'

రాత్రుళ్ళు కూడా నీ రూములోనే పడుకుంటే స్వప్న రాత్రంతా నిద్రపోదు ఆమెకు మొదటి నుంచి నామీద చెయ్యి వేసుకుని నిద్రపోవటం అలవాటు ఎంత బాధ ఉన్నా కోపంలో ఉన్నా నాకు దూరంగా పడుకోదు. ఆమె నానుంచి కోరుకునేది శారీరక సుఖం కాదు మానసికమయిన ఆనందం

ప్రతి విషయానికి ఆవిడగారికో ప్రత్యేకత ఆపాదించటం మీకలవాటు పెళ్ళి అయింతర్వాత భర్త మీద చెయ్యి వేసుకుని పడుకోవటం ప్రతి ఆడదానికి అలవాటవుతుంది అటువంటి కోరికలు నాక్కూడా ఉంటాయని మీ రెందుకు ఊహించరో నాకర్థం కావటం లేదు మీరెంతసేపూ ఆమెను భార్యగా ఆమె బాధపడకూడదని ఆలోచిస్తారే తప్ప నన్ను గురించి ఆలోచించరు

మోహినీ! నువ్వు చదువుకున్న మూర్ఖురాలివి నీ కెలా అర్థమయేలా

జరిగిన కథ–7 జయరాం ప్రియురాలు మోహిని గర్భవతయిందని రఘునాద్ స్వప్నకు చెపుతాడు జయరాంకు విడాకులు ఇచ్చేయమని చెప్తాడు స్వప్నకు తను అండగా ఉంటానంటాడు అతనికి తనపై నున్న ప్రేమకు చలించి పోతుంది స్వప్న మోహినిని రహస్యంగా గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు జయరాం మోహినికి కొడుకు పుట్టాడు మోహినిని బాబుని వాళ్ళతోపాటు మోహిని తల్లిని స్వప్న ఇంటికి తీసుకు వచ్చేస్తాడు జయరాం మాధవరావుగారు కూతురి సుఖం కోసం కూడపెట్టిన ఐశ్వర్యమంతా మోహిని వాళ్ళమ్మ అనుభవిస్తున్నారు

చెప్పాలో నాకర్థం కావటం లేదు ఈ విషయంలో మాత్రం నువ్వు చెప్పినట్టు జరగదు ఇంకెప్పుడూ మన మధ్య ఇలాంటి సంభాషణ తీసుకురావద్దు

మానాన్న చెప్పినా కాదని మీకు రెండో భార్య నయ్యాను మానాన్న మిమ్మల్ని చేసుకోవద్దని ఎందుకంతగా చెప్పారో ఇప్పుడర్థమయింది నాకు మిమ్మల్ని పెళ్ళి చేసుకుని నా జీవితాన్ని నాశనం చేసుకున్నాను

వళ్ళు మండిపోయింది జయరాంకు ఆ మాటలకు అయినా తమాయించుకున్నాడు

పెళ్ళానికి అంతభయపడే వారు నన్నెందుకు పెళ్ళి చేసుకోవటం?

మోహినీ' కుక్కను తీసుకొచ్చి సింహాసనం మీద కూర్చో బెట్టినా దానికి సహజంగా ఉన్న చెప్పులు కొరికే అలవాటును మార్చుకోలేదంట నీ బుద్ధి అలాగే ఉంది

నువ్వు నాలుగు సంవత్సరాలు నా ఆఫీసులో పని చేసావు అన్ని రోజుల్లోనూ నువ్వు ఒక్క సారి కూడా ఖరీదయిన చీర కట్టుకోవటం నేను చూడలేదు అలాంటిది ఇప్పుడు రోజుకో రకం చీరలు కడుతున్నావు మీ అమ్మా నువ్వూ కలలో కూడా ఊహించలేని రాజభోగాలు అనుభవిస్తున్నారు నువ్వు నన్ను రహస్యంగా పెళ్ళి చేసుకోవటానికి అంగీకరించింది కూడా నా డబ్బు మీద వ్యామోహంతోనే గాని నామీద ప్రేమతో గాదన్న విషయం నాకుతెల్సు నువ్వు చూపులతో మాటలతో నన్ను రెచ్చగొట్టకపోతే నేనసలు నీవలలో పడేవాడినే కాదు నాకు పిల్లలు కావాలి నీకు డబ్బుతో అనుభవించగల సుఖాలు కావాలి ఇద్దరం స్వార్థంతోనే ఒకరికొకరం దగ్గరయ్యాం మనిద్దరం ఒకర్ని ఒకరం విమర్శించుకోవటం అనవసరం అన్నీ తెల్సి నన్ను చేసుకున్నావు అన్ని షరతులకు అంగీకరించి ఈ ఇంటి కొచ్చావు ఇంకొక్కసారి జీవితం నాశనం అయిందన్నావంటే నా బాబును నేను తీసుకుని నీ ఖర్మానికి నిన్ను వదిలేయాల్సి వస్తుంది జాగ్రత్త అంటూ విసురుగా ఆరూములోనుంచి బయటకొచ్చాడు జయరాం

అవాక్కయిపోయింది మోహిని ఎలాగో అతన్ని తన రూములో పడుకునేటట్టుగా చేసుకుంటే కొంతకాలానికి మాటలతో చేష్టలతో అతన్ని పూర్తిగా తన వాడిగా చేసుకుని అధికారాన్నంతా తను దక్కించుకోవాలనుకుంది అతనలా వ్యతిరేకంగా మాట్లాడతాడనుకోలేదు ఏ విషయం మాట్లాడాలన్నా అతను తన రూములో ఉండేదే గంట ఆ గంటలో ఏం మాట్లాడటానికి వీలుండదు

ఆ ఇంటి నుంచి దూరంగా వెళ్ళాల్సి వస్తుందేమో అన్న ఊహను కూడా భరించలేక పోతుంది ఏ సీ రూములో ఉండటానికి కారుల్లో తిరగటానికి ఖరీదయిన తిండికి అలవాటు పడిపోయింది అటువంటిది కోపంతో వేరే ఇల్లు అద్దెకు తీసుకుని ఉంటే ఈ రాజభోగాలు ఉండవు తను కావాలనుకుందే వాటిని స్వప్న ఇంతవరకు ఒక్క సారికూడా ఆమెతో మాట్లాడలేదు తనను మాట్లాడించదు పట్టించుకోదు ఇంట్లో పెత్తనమంతా చాలా వరకూ ఆమెదే ఇటువంటి చిన్న విషయాలను పట్టించుకుని గొడవలు చేసుకుంటే తను కూర్చున్న కొమ్మను తనే నరుక్కున్నట్టు అవుతుందనుకుంది స్వప్నను గురించి భర్త ముందు తేలికగా మాట్లాడి అతనికి కోపం తెప్పించటం తనకే మంచిది కాదని అర్థం చేసుకుంది

★ ★ ★ ★ ★

బాబు ఆయా చేతుల్లో ఆగకుండా గుక్క పట్టి ఏడుస్తున్నాడు ఎంత సముదాయించినా ఏడుపు ఆపటం లేదు స్వప్న వచ్చి బాబు నెత్తుకుంది బాబంటే స్వప్నకు కూడా చాలా ప్రేమ ఆమెను చూస్తే చాలు బాబు బోసినోటితో నవ్వుతూ ఎత్తుకోమన్నట్టు చేతులు చాపుతాడు

మోహినికి బాబు మీద అంత శ్రద్ధలేదు పాలు మాన్పించిన తర్వాత బాబును అస్సలు పట్టించుకోవటం మానేసింది ఆయా లేకపోతే స్వప్న చూస్తారు బాబును జయరాంకు కూడా బాబు స్వప్న దగ్గర ఉండటమే ఇష్టం

బాబును అపురూపంగా లాలనగా మృదువుగా ఎత్తుకుంటుంది స్వప్న ఆ ఎత్తుకునే తీరులోనే స్పష్టమవుతుంది ఆమెకు బాబు మీద ఎంత ప్రేమో ఇప్పుడు బాబును రాత్రుళ్ళు ఎత్తుకుని తీసుకొచ్చి స్వప్న పక్కన పడుకోబెడుతున్నాడు జయరాం బాబు తను అమితంగా ప్రేమించే జయరాం రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ బాబుకు అతను తండ్రి తను తల్లి అన్న భావం తప్ప బాబు తల్లి మోహిని అన్న విషయమే మరిచిపోయింది



# ప్రేమసాగరం

స్వప్న ఎత్తుకోగానే బాబు చిత్రంగా ఏడుపు మానేసాడు బాబు ఏడుపుకు మోహినీ వరలక్ష్మి కూడా వరండాలో కొచ్చారు

బాబెందుకు గుక్కపెట్టి ఏడుస్తున్నాడు? అంది వరలక్ష్మి బాబును స్వప్న ఎత్తుకోవటం చూచి మాట్లాడకుండా లోపలికెళ్ళింది మోహిని

వాళ్ళమ్మగారు కావాలని అలా ఏడ్చాడు నోటితో చెప్పటానికి మాటలు రావుగా? అందుకని ఏడుపుతో చెప్పాడు స్వప్నగారు ఎత్తుకోగానే ఏడుపు మానేసాడు చూడండి అంది నవ్వుతూ ఆయా

గొడ్డుబోతు వాళ్ళకేం తెల్సు? బిడ్డ నెప్పులని బాబు నెత్తుకోవటానికి నిన్ను బెట్టుకుంటే వాళ్ళకూ వీళ్ళకూ ఇస్తావేం? పిల్లా పాపా లేనివాళ్ళ చూపులు పడితే పసిపిల్లలు కోలుకోలేరు అంది వరలక్ష్మి మూతి చేతులు తిప్పుతూ

స్వప్నకు కాళ్ళ కింద భూమి కంపించినట్టనిపించింది స్వప్న స్థితిని చూసిన ఆయాకే కోపం ఆగలేదు ఆయా కూడా చదువూ సంస్కారం వున్న మనిషి ఉన్న ఇద్దరు కూతుళ్ళకూ మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేసింది ఏ బాధ్యతా లేదు కాలక్షేపం కోసం ఆయాగా పనిచేస్తుంది

వరలక్ష్మిగారూ! వీదుల్లోని కుక్కలూ పందులూ కూడా సంతానాన్ని కంటాయి అందులో గొప్పతనం ఏదిలేదు స్వప్నగారు బాధపడతారని తెల్సి కూడా మీరిలాగే మాట్లాడుతున్నారు అంది

ఇదిగో ఆయా! ఈ ఇంట్లో పనిమనిషివి నోటికొచ్చినట్లు మాట్లాడావంటే నిన్ను పనిలో నుంచి తీసివేయిస్తాను తెలుసా?

నాకూ మీకూ ఈ ఇంట్లో ఉన్న స్థానం ఒక్కటే అన్న విషయం గుర్తుపెట్టుకోండి అంది ఆయా కూడా కోపంగా

నన్ను పనిమనిషి అంటావా? నీ అంతు చూస్తాను ఇప్పుడే అమ్మాయి మోహినీ ఇలా రామ్మా అంటూ అరిచింది ఏం జరిగిందో అని పరుగెత్తుకొచ్చింది మోహిని

చూడమ్మా ఈవిడగారి అలుసు చూసుకుని ఈ ఆయా ముండ నన్ను ఎంతలేసి మాటలంటుందో నేను పనిమనిషినట

ఆయాకు చర్రుమంది ఆవిడ మాటలకు

వరలక్ష్మిగారూ! మర్యాద అనేది ఇచ్చిపుచ్చుకోవాలి మీరుపయోగించిన మాటనే నేను కూడా ఉపయోగించాల్సి వస్తుంది అంది ఆయా

ఎందుకలా అరుస్తావు? నువ్వు మా ఇంట్లో పనిమనిషివి కాదా? మా అమ్మను ఎదిరించి మాట్లాడేది చాలక ఇంకా మర్యాదంటూ అరుస్తున్నావా? అంది మోహిని కోపంగా




స్వప్న అయోమయంగా చూస్తూ బొమ్మలా అలాగే నిల్చుంది

ఇక నుంచి మా బాబుకు నువ్వు ఆయాగా పనిచేయాల్సిన అవసరంలేదు మా బాబు పనులు నేను చూసుకుంటాను బాబునిలా తీసుకురా అంది కటువుగా

మోహిని అంత కటువుగా మాట్లాడుతుందని అనుకోని స్వప్న యాంత్రికంగా బాబును ఆయా చేతికిచ్చింది

ఆయా చేతుల్లో నుంచి విసురుగా బాబును లాక్కుని వెళ్ళిపోయింది స్వప్న ఇంకేం మాట్లాడకుండా అక్కడనుంచి వెళ్ళిపోయింది !

* * * *

అలవాటు ప్రకారం ఇంటికొచ్చిన జయరాం బాబుతో ఆడుకుంటూ కూర్చున్నాడు బాబు బట్టలు తడిపాడు బాబుకు బట్టలు మార్చటానికని ఆయాను పిలిచాడు జయరాం

ఆయాను మానిపించాను అంది మోహిని బాబును అతన్నించి అందుకుంటూ

ఎందుకని? ఆవిడ బాబునెంతో ప్రేమగా చూస్తుంది కదా? మళ్ళీ అలాంటి మనిషి దొరకాలంటే ఎంత కష్టం? నాకు చెప్పకుండా ఎందుకు మానిపించావు" అన్నాడు జయరాం చికాకుగా

ఆవిడకు మనుష్యులను గౌరవించటం తెలియదు మా అమ్మను ఏ మాట పడితే ఆ మాటంటుంది మా అమ్మ ఈ ఇంట్లో పనిమనిషి లాంటిదంట అందుకే రేపటి నుంచి రావద్దన్నాను

చూడు మోహినీ! పనివాళ్ళతో మీ అమ్మకేమవసరం? ఎన్నిసార్లు చెప్పినా అర్థంచేసుకోదేం?

మీరిలా మమ్మల్ని గురించి తేలికగా మాట్లాడుతున్నారు కాబట్టే ఈ ఇంట్లో పనివాళ్ళు కూడా తేలికగా మాట్లాడుతున్నారు మొగుడు ముండా అంటే ముష్టికి వచ్చిన వాళ్ళు కూడా ముండా అన్నారుట అలా ఉంది ఈ ఇంట్లో మా పని పనివాళ్లను మందలించాల్సింది పోయి మీరు కూడా వాళ్ళను వెనకేసుకొస్తున్నారు మీకంత బరువుగాఉంటే నా బిడ్డనూ మా అమ్మనూ తీసుకొని వేరే ఇంటికి వెళతాను అంది బాబును వదులుకోవటానికి అతనే పరిస్థితుల్లోనూ ఇష్టపడడన్న విషయం ఆమెకు తెల్సు అతని బలహీనతని కనిపెట్టి మాట్లాడుతుంది

స్వప్న బాబును ఎంత ప్రేమగా చూసుకుంటుందో జయరాంకు తెల్సు ప్రతిసారి మోహిని ఆమె త్యాగాన్ని గుర్తించకుండా నా బిడ్డ నా బిడ్డ అని మాట్లాడి స్వప్న మనస్సు నొప్పించటం అతను భరించలేకపోతున్నాడు వాళ్ళమ్మ ఎంత గొడవ చేస్తే ఆయా తనక్కూడా చెప్పకుండా వెళ్ళిందో అతనూహించగలడు తనేం మాట్లాడినా ఘర్షణే తప్ప ప్రయోజనం ఉండదని మవునంగా టీపాయ్ మీదున్న పేపరందుకున్నాడు

మోహిని బాబుకు బట్టలు మార్చటానికి బాబును తీసుకుని లోపలికెళ్ళింది

జయరాంకు మనస్సు పేపరు మీద లగ్నం కాలేదు రోజూ పనివాళ్లతో వరలక్ష్మి గొడవ పడటం పనివాళ్ళు వచ్చి అతనితో మొరపెట్టుకోవటం అతను వాళ్లకేదో సర్దిచెప్పటం ఇవన్ని అతనికి చికాకును కలిగిస్తున్నాయి పగలంతా బయటుండే తనకే ఇంత విసుగ్గా చికాకుగా ఉంటే సున్నితమయిన స్వప్న మనస్సు రోజూ ఎంత బాధపడుతుందో అనుకున్నాడు

డబ్బు మనుషుల్లో ఎటువంటి మార్పును కలిగిస్తుందో వరలక్ష్మిని చూస్తేనే తెలుస్తుంది

వాళ్ళను అద్దె ఇంట్లో నుంచి దేవాలయంలాంటి ఈ ఇంట్లోకి తీసుకొచ్చి పొరపాటు చేసాను – అని మనస్సులోఎంతో బాధపడ్డాడు

అతనికి మద్య ఇంటికి రావాలంటేనే భయంగా ఉంటుంది

కుర్చీలో నుంచి బెడ్ రూములో కెళ్లాడు స్వప్న కనిపించలేదు లాన్‌లో కొచ్చి చూసాడు అక్కడా కనిపించలేదు గదులన్నీ వెతికాడు ఎక్కడా కనిపించలేదు స్వప్నకు స్నేహితులు కూడా ఎవరూ లేరు తనకు తెలియకుండా ఎక్కడకెళ్ళదు స్వప్న ఎక్కడికెళ్ళింది అతని మనస్సులో ఎన్నో అనుమానాలు భయాలు చోటు



కలువబాల
కలువబాల
కలువబాల

# ప్రేమసాగరం

చేసుకున్నాయి తల పట్టుకుని కూర్చున్నాడు

* * * *

వాళ్ళను ఇంట్లో నుంచి పంపించెయ్యటమే సమస్యలన్నింటికి పరిష్కారం అన్నాడు స్వప్న చెప్పిందంతా విన్న రఘునాద్

ఎలా పంపించటం? నేనే వాళ్ళను తీసుకురమ్మని చెప్పాను

స్వప్నా నువ్వింత అమాయకురాలివి కాబట్టే ఆ వరలక్ష్మి నీ యింట్లో ఉంటూ నీ మీద పెత్తనం చలాయిస్తుంది లేకపోతే, కూటికి గతిలేని వాళ్ళు మహారాణుల్లా గడుపుతున్నారు అన్నీఉన్న నువ్వు నీ ఇంట్లోనే పరాయి దానిలా బ్రతుకుతున్నావు దీన్ని త్యాగం అనరు పిరికితనం అంటారు జయరాం చేతిలో నువ్వు కీలుబొమ్మలా మారిపోయావు బాధగా అన్నాడు

ఇలాంటి మనుష్యులనుకోలేదు

భార్య వున్న మగాడిని వలలో వేసుకున్న ఆడది ఎంత సంస్కారం ఉన్న మనిషో ఊహించలేకపోయావు

జరిగిందేదో జరిగిపోయిందిగా ఇప్పుడు జరగాల్సింది ఆలోచించాలి

ముందు నువ్వు వంటరితనం నుంచి బయటపడాలి రోజూ ఫ్యాక్టరీకెళ్ళి ఆఫీసు వ్యవహారాలు చూసుకోకూడదూ?

నాకేం తెల్సు?

రోజూ వెళ్ళి చూసుకుంటే అదే అర్ధమవుతుంది

నాకెక్కడికి వెళ్లాలనిపించదు ఏ పనీ చెయ్యాలనిపించదు అస్సలు నేనెందుకు బ్రతుకుతున్నానో నాకే అర్ధం కావటంలేదు

స్వప్నా' అలా ఎప్పుడూ ఆలోచించకు

భవిష్యత్తే లేని నేను ఇంకెలా ఆలోచించగలను?

పోనీ నువ్వే ఆ ఇంటి నుంచి వేరుగా వచ్చేస్తే

ఎక్కడికి?

నీ కోసం నేను నిర్మించిన ప్రేమాలయానికి

ఆ అర్హత నాకు లేదు

అలా ఎందుకనుకుంటున్నావు?

పూచిన పూలన్నీ భగవంతుని పాదాలను చేరవు ఎన్నో రాలి ధూళితో కల్సిపోతుంటాయి

మనం చిన్నతనం నుంచి కల్సిమెల్సి తిరిగాం నా గుండెల్లో నీకోసం ఆ వయస్సులో నే గుడి కట్టాను ఆ గుడిలో ప్రతిష్ఠించిన నీ రూపం అలాగే చెక్కు చెదరకుండా ఉంది ఈ పూజారి పూజలెప్పుడూ అందుకుంటూనే ఉంటుంది

నిన్ను పెట్టిన బాధ నా పాలిట శాపంగా మారింది

పిచ్చి స్వప్నా' నువ్వెంతో తెలివిగలదానివనుకున్నాను నీ జీవితాన్ని గురించి నువ్వే ఆలోచించుకోలేనంత అమాయకురాలివి

వెళతాను

ఆ నరకంలో ఉండేకంటే ఇక్కడే ఉండిపో స్వప్నా

ఒక్క రోజు కంటే ఎక్కువ ఉండలేను జయరాంను చూడకుండా ఇంత చేసినా అతనింటికి రావటం ఒక గంట లేటయితేనే మనస్సు బాధతో రెపరెపలాడుతుంది

## అంతరం

తరాల అంతరం  
నిరంతరం ఒక్కటే  
ఒకటి క్రొత్త గుర్రమై  
ఉరకలేస్తుంది  
మరొకటి పాత కళ్ళెమై  
వెనక్కు లాగుతుంది

-పి జయశ్రీ

నీకెవరూ సానుభూతి కూడా చూపరు రఘునాద్ గొంతులో మృదుత్వం తగ్గిపోయి క్రమంగా కోపం చోటు చేసుకుంది అతని మాటలకు విషాదంతో కూడిన చిరునవ్వు మెరిసింది ఆమె పెదవుల మీద మరో గంట కు ర్చుని ఇంటికి బయలుదేరింది స్వప్న

* * * *

రాత్రి పన్నెండు గంటలయింది బెడ్ రూమ్‌లోకొచ్చాడు జయరాం అతను మోహిని రూములో నుంచి వచ్చాడని స్పష్టంగా తెలుస్తుంది ట్యూబ్‌లైట్ కాంతిలో అతని చెంపలమీద కాటుక రేఖలు కుంకుమరేఖలు కనిపిస్తున్నాయి చూడలేక ముఖం తిప్పుకుంది స్వప్న

నేను వేరే యింటికి వెళ్ళి పోవాలనుకుంటున్నాను

స్వప్నా ఏమిటి నువ్వనేది? ఆశ్చర్యం నుంచి తేరుకుని అడిగాడు జయరాం

ఈ ఇంట్లో నేనుండలేను

వాళ్ళనే ఇక్కడ నుంచి పంపించేస్తాను

వాళ్ళతో బాటు మీరూ వెళతారుగా? ఎదయితేనేం?

నీతో బాటు నేను కూడా వస్తాను ఎక్కడికెళదామో చెప్పు

మీరెందుకు?

నీలోని అనురాగం నా నుంచి దూరంగా వెళ్ళనివ్వదు

ఏం నేను బ్రతుకుండటం కూడా మీకిష్టంలేదా?

స్వప్నా ఆర్ద్రతగా పిలిచాడు

నన్నలా పిలవకండి అలా పిలిచిన ప్రతిసారి నా మనస్సు గతంలోకి పరుగెత్తుతుంది ఆ జ్ఞాపకాలు నేను భరించలేను దోసిట్లో ముఖం దాచుకుని ఏడుస్తుంది

జయరాం ఆమెకు దగ్గరగా వచ్చాడు

ప్లీజ్ నన్ను ముట్టుకోవద్దు అంది ఆమె మాటలు వినిపించుకోనట్టుగా ఆమెకు దగ్గరగా జరిగి ఆమె భుజాలు చుట్టూ చేతులేసి ఆమెను తనకభిముఖంగా తిప్పుకున్నాడు

చెప్పు సప్నా' నాకు దూరంగా వెళ్ళగలవా? వెళ్ళినా బ్రతకగలవా? ముఖానికి అడ్డుగా ఉన్న ఆమె చేతుల్ని తొలగించి ఆమె కళ్ళలో కళ్ళు పెట్టి చూస్తూ అడిగాడు

ఉండగలను మీతో కల్సి బ్రతకలేను

చంద్రుడు సూర్యునికి దూరంగా ఉండలేడు ఉన్నా ప్రకాశించలేడు అంటూ ఆమెను ఊరట పరిచేందుకు ఆమె తలను గాఢంగా గుండెలకు అదుముకున్నాడు స్వప్న మరి నిగ్రహించుకోలేక పోయింది ఆమె కన్నీరు గట్టు తెగిన వాగులా ప్రవహించింది

నేను నా ఆస్తినంతా ఇవ్వమన్నా ఇవ్వగలను నా ప్రాణాలివ్వమన్నా ఇవ్వగలను కానీ, మిమ్మల్ని మాత్రం త్యాగం చెయ్యలేను నన్ను ఆర్తిగా చుట్టుకున్న ఈ చేతులు ఇప్పటివరకూ మోహినిని చుట్టి ఉన్నాయన్న నిజాన్ని నా గుండె భరించలేకపోతుంది మీ మాటలు మీ చూపులూ మీ ప్రేమా అన్నీ నాకే పరిమితం అనుకున్నాను మిమ్మల్ని పంచుకుంటున్న మోహిని ఉనికిని భరించలేక పోతున్నాను హృదయాన్ని కదిలిస్తుంది ఆమె కన్నీరు అతను ఆమెను ఎలా ఓదార్చగలడు" ఏమని ఓదార్చగలడు?

బాధగా కళ్ళు మూసుకున్నాడు జయరాం కళ్ళు మూసుకుని ఆలోచించసాగాడు తనను కావాలని కోరి పెళ్ళి చేసుకున్న స్వప్న నా మూలంగా ఏం సుఖపడింది? నేనెందుకిలా చేసాను? ఆలోచనలకు బ్రేక్ వేసి కళ్ళు తెరిచి చూసాడు స్వప్న కళ్ళు మూసుకుని పడుకుంది బెడ్ లైటు కాంతిలో ఆమె శరీర ఛాయ మరింత అందంగా ఉంది జయరాం దీర్ఘంగా నిట్టూర్చి స్వప్న వైపు తిరిగాడు

స్వప్న మోహిని విషయం తెలిసిన దగ్గర్నుంచి శారీరకంగా భర్తకు దూరంగా ఉంటుంది జయరాంకు ఆ లోటు మోహిని తీరుస్తుంది స్వప్నను బలవంతపెట్టాల్సిన అవసరం లేకపోయింది ఆమెను దగ్గరకు తీసుకోవాలంటేనే సిగ్గుతో అతని తల వాలిపోతుంది అతను చేసిన పనికి స్వప్న నిద్రపోతోందా లేక కళ్ళు మూసుకుని పడుకుందో తెలియదు ఆమెను చూస్తూ పడుకున్నాడు జయరాం

(ఇంకా ఉంది)

# పాలమ్మని డైరి

## ప్రపంచంలో పెద్ద హోటళ్ళు!

ప్రపంచంలోని నగరాలలోని అతి అదునాతనమైన హోటళ్ళ లెక్కలో బొంబాయిలోని తాజ్‌మహల్ ఒక్కటే లెక్క కొస్తుందట అలాగే అర్జంటైనాకు చెందిన బుయినాస్ ఎయిరిస్‌లోని క్లారిడ్జ్ హోటలు ఫ్రాంక్‌ఫర్ట్‌కు చెందిన ఇంటర్ కాన్టినెంటల్ పారిస్‌కు చెందిన ఇంటర్ కాన్టినెంటల్ రోమ్‌లోని గ్రాండ్ హోటలు టోక్యోలోని ఒకూరా హోటలు టొరింటోలోని పార్క్‌ప్లాజా హోటళ్ళు అతిపెద్దవట

## హత్యకి దారి తీసిన ఆటల తగాదా!

డిల్లీ అప్పుపుర్ స్టేడియంలో జనవరి 26న జరిగిన హాకీ ఆటల పందెంలో హిస్సార్‌కి చెందిన 17 ఏళ్ళ గోపాల్ అనే యువ ఆటగాడిని ఎదుటి టీమ్ ఆటగాడు రాదూర్ తన చేతిలోని హాకీ బ్యాటుతో తలమీద దబదబ బాది చంపేశాడట ఆటలోని తగాదాలలో యీ విషాద విపరీతం జరిగిందట

## కిరాతకానికి దారి తీసిన పగ!

తిరుచ్చికి చెందిన తూతూర్ గ్రామవాసులంతా ఒకటిగా చేరి ఆ వూరిలోని పరమ దుర్మార్గుడైన చెంగముత్తు అనే వొకతన్ని మొన్న జనవరి 27వ తేదీన మట్టుపెట్ట దలిచి అతని యింటిమీద డీసెలుపోసి నిప్పంటించి ఎవరూ బయటికి రాకుండా కాపలా కాశారట ఫలితంగా 55 ఏళ్ళ చెంగముత్తు అతని బార్య 44 ఏళ్ళ చెల్లమ్మాళ్ వారి ఎనమండుగురు కొడుకులు నలుగురు కూతుళ్ళు ఇద్దరు మనుమరాళ్ళు - మొత్తం పదహారు మంది కాలి మసైపోయారట 13 ఏళ్ళ కూతురు కలైచెల్వి మాత్రం ఆ రాత్రి తన స్నేహితురాలి యింట్లో పడుకున్నందువల్ల బ్రతికిందట 20 ఏళ్ళ క్రితం ఆ గ్రామవాసులు అతని అక్రమాలను బరించలేక ఆ గ్రామమే వదిలేసి పారిపోయారట 1984లో గూండా చట్టంలో అతన్ని అరెస్టు చేశాక ఆ వూరివారు తిరిగి వూరు చేరారట ఈ పగతో వారు ఇంతటి కిరాతఘాతుకాన్ని చేశారట

## విశ్వ విద్యాలయానికి వెళ్ళిన డాక్టర్ అదృశ్యం!

కె యస్ రావు అనే 29 ఏళ్ళ డాక్టరు వైద్యశాస్త్రంలో కొన్ని పుస్తకాలు పరిశీలించడానికి డిల్లీ వచ్చారట ఆయన వచ్చిన నాడు (డిశంబరు రెండో వారం) విశ్వ విద్యాలయానికని వెళ్ళి యిహ తిరిగి రాలేదట ఒకరోజూ రెండు రోజులూ చూసిన ఆయన బార్య అనిత యీ విషయం డిల్లీ పోలీసులకు ఫిర్యాదు చేసిందట డాక్టర్ రావు చండిఘర్‌కు చెందిన పి జి ఐ లో పని చేస్తున్నారట

## కోడల్ని చంపిన అత్తకు శిక్ష!

అమృత్‌సర్‌కు చెందిన 51 ఏళ్ళ అమ్రిక్ కౌర్ అనే ఆవిడ తన కొడుక్కు పోయిన ఎప్రియల్‌లో హర్‌ప్రీత్ అనే ఆమెను యిచ్చి వివాహం చేసిందట యస్ యల్సి కూడా ప్యాసుకాని అతనికి బియ్యే ప్యాసయిన తన కూతుర్ని యిచ్చి దాంతోపాటు 50 వేల రూపాయలూ సమర్పించుకున్నాడట హర్‌ప్రీత్ తండ్రి పెళ్ళయిన్నాటి నుంచి మరింత కట్నం తెమ్మని అత్తగారా పిల్లని నానా హింసలూ పెట్టి చివరికి ఆమెమీద కిరసనాయిలు పోసి వెలిగివున్న స్టౌమీదికి తోసేసిందట హర్‌ప్రీత్ కాలి చనిపోతూ మరణ వాగ్మూలంలో యీ విషయం పోలీసులకు చెప్పిందట చట్టం ఆ అత్తగారిక యావజ్జీవకారాగార శిక్ష విదించిందట

## ఉపాధ్యాయినికి మరణశిక్ష!

బంగ్లాదేశ్‌కు చెందిన జెస్సోర్‌లో ముస్తాకమత్ అనే వో ఉపాధ్యాయిని, తన ప్రేమ ఫలించక పోయేసరికి కసితో తన స్కూలు విద్యార్థిని రజియాబీగమ్ మీద నైట్రిక్ యాసిడ్ జల్లిందట తాను ప్రేమించిన వ్యక్తిని యీ రజియా మొన్న వివాహం చేసుకుందట ఆ కసితో ఆమె రజియా యింటి కిటికిలోంచి రజియామీద నైట్రిక్ ఏసిడ్ విసిరిందట ఈ నేరానికి బంగ్లా కోర్టు ఆమెకు మరణశిక్ష విదించిందట నైట్రిక్ ఆమ్లాన్ని ఆమె వో స్ప్రే గన్‌లో పోసి కిటికీలోంచి స్ప్రే చేసిందట

## ఢిల్లీలో కట్నపు చావులు!

వెస్ట్ డిల్లీకి చెందిన హర్షలతను ఆమె అత్తమామలు మరింత కట్నంగా తెమ్మని చిత్రహింసలు పెట్టుతుండేవారట నిరుద్యోగి అయిన ఆమె బర్త కూడా ఆమెను తీరిక చేసుకుని చావబాదేవాడట ఈ బాదలు బరించలేక ఆమె కిరసనాయిలూ నిప్పుతో తన జీవితాన్ని అంతం చేసుకున్నదట ఆమె నాలుగేళ్ళ కొడుకు బాలును ఆ పిల్లాడి మేనమామకు చేర్చారట పోలీసులు

నాలుగేళ్ళు గడిచినా కడుపు రాలేదని అత్తమామలూ, మొగుడూ చావబాదుతూ పెట్టే హింసలు బరించలేక చింతాదేవి అనే 22 ఏళ్ళ ఆమె కూడా కిరసనాయిలు మీద పోసుకు నిప్పంటించుక చనిపోయిందట ☐





# విలాపాగ్నులు

చిరవళ్ల శివాజీ

రాత్రి....

పదకొండు గంటలు దాటుతోంది. భూగోళం మీద బోర్లించిన చీకటి కప్పులా నల్లగా వుంది ఆకాశం. విషాదంగా ముగిసిన రసజీవుల అంతిమ శ్వాసలా వీస్తోంది గాలి. అప్పటికే ఆ పల్లెటూళ్లో చాలామంది దీపాలు ఆర్పేసి నిద్రాదేవి ఒడిలోకి జారిపోయారు. కానీ... జానకిరామయ్య యింటి వరండాలో మాత్రం యింకా దీపం గుడ్డిగా వెలుగుతూనే వుంది.

ఆ యింటి వరండాలో మంచంపై పడుకుని వున్న జానకిరామయ్య ఊపిరి అందక మెలికలు తిరిగిపోతూ చావు బతుకుల నడుమ ఊగిసలాడుచున్నాడు. ఆ మంచానికి కొంచెం ఎడం వేపు కూర్చున్న అతని భార్య యశోదమ్మ ఎరుపెక్కిన కళ్లతో విషాదపూరిత ముఖంతో.... మూర్తీభవించిన శోకంలా వుంది.

మరణయాతన అనుభవిస్తున్న తన భర్తను చూస్తుంటే యశోదమ్మ హృదయం బొల్లి గద్ద కాళ్ల మధ్య యిరుక్కుపోయిన కోడిపిల్లలా గింజుకోసాగింది. ఎలాంటి అభిప్రాయ భేదాలు లేకుండా సుమారు ముప్పయి సంవత్సరాలుగా జానకిరామయ్యతో సహజీవనం సాగిస్తున్న ఉత్తమ యిల్లాలు యశోదమ్మ.

ఏ యిల్లాలైనా తన భర్త సమక్షంలోనే తాను కన్ను మూయాలని కోరుకుంటుంది. కానీ తన కళ్ళ ముందే తన భర్త ఆఖరి శ్వాసను వీల్చే దృశ్యాన్ని చూస్తున్నప్పుడు... ఆ యిల్లాలు అనుభవించే బాధ, ఆమె గుండెల్లో ధ్వనించే వేదన ఏ రచయిత కలానికీ, ఏ గాయకుని యొక్క గళానికీ, ఏ చిత్రకారుడి కుంచెకూ అందవు.

నిశ్శబ్దం అలుముకున్న ఆ యింటి వరండాలో అప్పుడప్పుడు జానకిరామయ్య మూలుగు క్రమబద్ధంగా ధ్వనిస్తోంది. ఆ మూలుగు వింటున్న కొద్దీ యశోదమ్మ ఏడుపు ఉధృతమవసాగింది. ఆ యింటి వరండాలో చేరిన యిరుగు పొరుగు ఓ అయిదారుగురు వ్యక్తులు యశోదమ్మను ఓదార్చే ప్రయత్నం చేస్తున్నారు.

"టెలిగ్రామిచ్చి నాలుగు రోజులు అవుతోంది. వాడికది వెంటనే అందినట్టు లేదు. అందుకే యింత ఆలస్యం. ఈసరికి రమణ ఏ రైల్లోనో తప్పకుండా వస్తూ వుంటాడు" - రమణ వస్తాడనే నమ్మకం నిజంగా తనకు లేకపోయినప్పటికీ యశోదమ్మకు ధైర్యం చెప్పే ఉద్దేశ్యంతో ఆ మాట అన్నాడు కరణం.

'రమణ' అనే పదం కరణం నోట్లోంచి అలా వెలువడగానే ఆతృతగా కళ్ళు తెరచి చూశాడు జానకిరామయ్య. 'గొడ్రాలు' అని లోకం చేత ముద్ర వేయించుకున్న ఒక యిల్లాలికి డాక్టర్ ద్వారా తను గర్భవతనే విషయం తెలిసినప్పుడు... ఆ స్త్రీ కళ్ళలోని మెరుపులా జానకిరామయ్య కళ్ళలో ఆక్షణంలో ఆనందం... ఆరాటం... ఆతృత...

కానీ... ఆ ఆనందమంతా నిప్పు మీద పడ్డ నీటి బిందువులా ... క్షణంలో ఆయన కళ్లలోంచి ఆవిరైపోయింది. ఏ కొడుకు కోసం జానకిరామయ్య జారిపోయే ప్రాణాన్ని లాక్కుంటూ తన కళ్ళలో వొత్తులు వేసుకుని ఎదురు చూస్తున్నాడో ఆ కొడుకు యింకా రాలేదన్న నిజం ఆ ముసలి హృదయాన్ని బలంగా బరిసెపోటు పొడుస్తోంది. తన కొడుకు వస్తాడనే నమ్మకం ఆయనలో నశిస్తోంది.

"రమణ" - అంటూ జానకిరామయ్య పెదవులు మెల్లగా వణికాయి. ఎక్కడో అగాధాలు అడుగు నుంచి వచ్చిన ఆ పిలుపు కొన్ని వందల కిలోమీటర్ల దూరంలో వున్న రమణ కెలా వినబడుతుంది? ఈ వ్యాపార నాగరికతా ప్రపంచంలో... ఆర్థిక సంబంధాలు ఆధిపత్యాన్ని చలాయించే ఈ ఆధునిక సమాజంలో ఒక తండ్రి ఆర్తనాదాన్ని ఏ శక్తి కొడుకు చెవిలో పడెయ్యగలదు?

"నాకు... నాకు తెలుసు. వాడు.... వాడు రాడు" - ఆ మాట అంటుంటే జానకిరామయ్య కళ్ల నుండి అశ్రువులు ఉప్పెనలా పొంగాయి. ఎన్నో సంవత్సరాలుగా కొడుకు పట్ల తనలో పెంచుకున్న మమకారం... మంచుగడ్డలా కరిగిపోతూ ఆయన కళ్ళ ద్వారా అశ్రువులై పొంగి చెక్కిలిపై జారిపోతున్నాయి.

"బావా! నువ్వు అనవసరంగా దిగులు పడకు. అవసాన దశలో తండ్రిని చూడడానికి రాకుండా వుండేందుకు వాడేమన్నా మనసూ, మమకారాలు లేని పశువనుకున్నావా? వేళకు ఆ టెలిగ్రామ్ అందిందో లేదో పైగా చాలా దూరమాయె" - అంటూ జానకిరామయ్యను సముదాయించాడు పక్కింటి శంకరయ్య.

ఈ సమాజంలో ఉన్నత స్థాయి కోసం ప్రతిక్షణం ప్రాకులాడుతూ, హోదాల కోసం ఆరాట పడుతూ, పార్టీలతో, ఫంక్షన్లతో క్షణం తీరిక లేకుండా జీవితాన్ని కొనసాగిస్తున్న వ్యాపార దృక్పథం గల ఆధునిక మానవుడి దృష్టిలో మమతలూ, మమకారాలూ, ఆత్మీయతలూ, అన్నీ అర్థం లేని సెంటిమెంట్స్ మాత్రమే.

క్షణాలు దొర్లిపోతున్నాయి. . జానకిరామయ్య యింటి వరండాలో చేరిన యిరుగు పొరుగు... అర్ధరాత్రి కావడం చేత అక్కడి నుండి ఒక్కొక్కరే లేచి తమ యిళ్ళకు వెళ్ళిపోయారు. ఆ వరండాలో యశోదమ్మ మాత్రమే మిగిలిపోయింది. వారం రోజుల నుండి సరిగ్గా నిద్ర లేకపోవడం చేత ఆమె కళ్ళు మండుతున్నాయి.

ఆ వరండాలో వున్న స్తంభానికి అనుకుని కూర్చుని గేటు వేపే చూడసాగింది యశోదమ్మ. ఆ గేటు ఎప్పుడు చప్పుడు చేస్తుందా గేటును తెరుచుకుని తన కొడుకు ఎప్పుడు లోనికి ప్రవేశిస్తాడా అని ఆతృతగా ఎదురు చూడసాగింది. ఆ మాతృమూర్తి నయనాలలో కొడుకు పట్ల ఆశ మిణుకు మిణుకు మంటోంది.

చిన్నప్పుడు రమణ జానకిరామయ్యను విడిచి ఒక్కక్షణం కూడా వుండేవాడు కాదు. ఆయన పొలం వేపు బయలుదేరినా, సంతకు ప్రయాణమైనా 'నేనూ వస్తా'నంటూ ఆయన దోవతీని పట్టుకుని వెంట పడేవాడు రమణ. 'వద్దు లోపలికి పోరా' అంటూ జానకిరామయ్య కొడుకును బుజ్జగించే వాడు, గదమాయించే వాడు.

తండ్రి వద్దని వారించినా పసితనంలో వెంటపడిన రమణ... యిప్పుడు ఆ తండ్రి చావుబ్రతుకుల నడుమ ఉన్నాడని ఉత్తరాలు రాసినా, టెలిగ్రామిచ్చినా రాలేదు. తమ జీవితపు చరమ క్షణాలను కొడుకు నీడలోనే గడిపెయ్యాలని గంపెడు కలలు కన్న ఆ తల్లి తండ్రులను కనీసం తన నీడను కూడా తాకనివ్వలేదు రమణ.

జానకిరామయ్యకు రమణ, సుగుణ యిద్దరే బిడ్డలు. చదువులో రమణ ఎంత చురుగ్గా వుండేవాడో సుగుణ అంత వెనుకబడి పోతుండేది. అందుకే సుగుణ రమణలా పెద్ద చదువులకు వెళ్ళలేకపోయింది. తన కొడుక్కి యింజనీరింగ్‌లో సీటొచ్చిందని తెలిసిన రోజున... జానకిరామయ్య ఆనందానికి అవధులు లేవు.

తన కొడుకు యింజనీర్ కాబోతున్నాడని జానకిరామయ్య సంబరపడిపోయాడే తప్ప రమణ యింజనీరింగ్ చదువు కోసం తమ ఆస్తి సగానికి పైగా హరించుకుపోయిందని ఆయన ఏనాడూ పట్టించుకోలేదు. యశోదమ్మ మాత్రం అప్పుడప్పుడు కరిగిపోతున్న ఆస్తి గురించి భర్తతో ప్రస్తావిస్తూ వుండేది.

"రమణ గొప్ప చదువులు చదువుకుని యింజనీర్ కావాలి అంతే. దానికోసం నా ఆస్తినే కాదు అవసరమనుకుంటే నా తలను కూడా తాకట్టు పెట్టగలను. అసలు బిడ్డల చదువుకోసం ఉపయోగపడని ఆస్తులు ఎన్నివుంటే మాత్రం ప్రయోజనమేమిటి"- అంటూ భార్యతో

వాదించేవాడు జానకీరామయ్య

రమణ యింజనీరింగ్ ఫైనలియర్లో ఉన్నప్పుడు హాస్టల్లో మెస్ బిల్ చాలా అయిందని ఆ బిల్ కట్టకుంటే పరీక్షకు తనను కూర్చోనివ్వరని కనుక వెంటనే రెండు వేల రూపాయలను పంపించమని ఓసారి ఉత్తరం రాశాడు జానకీరామయ్య అప్పటికే ఆవూళ్ళో చాలామందికి అప్పులు పడ్డాడు పాత అప్పులు తీర్చకనే మళ్ళీ తను అప్పు అడగడం బావ్యం కాదనిపించిందాయనకు

అందుకే డబ్బు కోసం ఆయన తన కోడెలను రెండింటిని అమ్మేశాడు ఒంగోలు కోడెల్లా అవి చాలా పుష్టిగా వుండేవి ఆ కోడెలంటే జానకీరామయ్యకు ప్రాణం అవి వాళ్ళ యింట్లోని ఆవులకు పుట్టాయి రోజూ స్వయంగా ఆయన వాటికి బుట్టమేత పెట్టేవాడు నోరు లేని ఆ మూగజీవులపై కొండంత మమకారాన్ని పెంచుకున్నాడాయన

ఆ కోడెల మీద జోరిగలు వాలితే జానకీరామయ్య మనసు గిజగిజలాడేది మమకారం పెంచుకోవడానికి ఎదుటిప్రాణి మనిషే కానవసరం లేదు కోడెలను పొరుగూరి వారికి అమ్మేసి మూడు వేల రూపాయలను అందుకుంటుంటే జానకీరామయ్య చేతులు వణికాయి ఊరి పొలిమేర వరకు ఆ కోడెల్ని సాగనంపి కొనుగోలు దారుల చేతికి వాటి పగ్గాలను అందించి తిరిగి యింటికి వస్తుంటే జానకీరామయ్య కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి

రమణ యింజనీరింగ్ పాసయ్యాడు వెంటనే అతడికి జబల్‌పూర్‌లో ఉద్యోగం వచ్చింది ఆ సమయంలోనే సుగుణకో సంబంధం కూడా వచ్చింది ఉన్న కొద్ది పొలాన్నీ అమ్మేసి కూతుర్ని ఓ యింటిదాన్ని చేస్తే తమ బాధ్యత కూడా చాలా వరకు తీరిపోతుందని యశోదమ్మ జానకీరామయ్యలు నిర్ణయించుకున్నారు

నీతో ఓ ముఖ్యమైన విషయం గూర్చి మాట్లాడాలి వెంటనే బయలుదేరిరమ్మని తండ్రి రాసిన ఉత్తరం చదివి రమణ వారం రోజులు సెలవు పెట్టి జబల్‌పూర్ నుండి వచ్చాడు సుగుణకు వచ్చిన పెళ్ళి సంబంధం గురించి తండ్రి చెప్పగా మరుసటి రోజే రమణ నాయుడుపేట వెళ్ళి ఆ అబ్బాయిని చూసి వచ్చాడు

నాన్నా! ఆ అబ్బాయి నాకెందుకో నచ్చడం లేదు పైగా మన సుగుణను పల్లెటూళ్ళో వ్యవసాయం చేసుకునే వాడికిచ్చి కట్టబెట్టడం నాకిష్టం లేదు ఏదైనా ఉద్యోగం చేశే అబ్బాయిని చూడండి కట్నం గురించి మీరు బెంగపెట్టు కోకండి ఉన్న పొలం అమ్మేద్దాం అది చాలకుంటే మిగిలిన డబ్బు సంగతి నేను చూసుకుంటాను

రమణ అలా అనగానే యశోదమ్మకు చాలా సంతోషం వేసింది జానకీరామయ్య కూడా కాదనలేక పోయాడు మరో ఆరునెలల తర్వాత రమణే స్వయంగా చెల్లెలికి ఓ సంబంధం చూశాడు అబ్బాయి ఉద్యోగి అందంగానే వున్నాడు కానీ కట్నం విషయమే జానకీరామయ్యకు కొంత యిబ్బంది వేసింది

రమణా! ఈ సంబంధం నాకు అన్ని విధాలుగానూ నచ్చిందిరా ఎటొచ్చీ కట్నం దగ్గరే కాస్త యిబ్బందిగా వుంది కట్నంగా పాతికవేలు పాతిక సవరల బంగారం యింకా లాంచనాలూ పెళ్ళిఖర్చులూ అన్నీ కలిపితే చాలా అవుతుంది ఇదంతా చూస్తుంటే ఈ సంబంధంతో మనం తూగలేమనిపిస్తోంది– అన్నాడు జానకీరామయ్య

అదేమిటి నాన్నా! డబ్బుకు భయపడి బంగారంలాంటి సంబంధాన్ని వదులుకుంటామా? ప్రస్తుతానికి కట్నం కొంత యిచ్చి మిగిలింది సంవత్సరం లోగా యిచ్చేస్తామని అడిగి చూద్దాం మీరు సరే అనండి మిగిలిన ఏర్పాట్లన్నీ నేను చూసుకుంటాను సుగుణకు కూడా ఈ సంబంధం బాగా నచ్చింది – అన్నాడు రమణ

సరే అనేశాడు జానకీరామయ్య

ప్రస్తుత్తం పదివేలు మాత్రమే యిస్తామని మిగిలిన పదిహేనువేలు సంవత్సరం లోగా యిచ్చేస్తామని అలా యివ్వకపోతే మా సుగుణను మీ యింట్లోంచి పుట్టింటికి పంపెయ్య వచ్చునని పెళ్ళి కొడుకు వాళ్ళతో ఒక ఒప్పందం చేసుకున్నాడు రమణ జానకీరామయ్య మర్యాదస్తుడని తెలుసుకున్నాక వాళ్ళీ ఒప్పందానికి సరేనన్నారు

జానకీరామయ్య పొలం అమ్మేశాడు ఉన్నంతలో ఏలోటూ రానివ్వకుండా కూతురి పెళ్ళి జరిపించి సుగుణను కాపురానికిపంపించేశాడు ఇక వాళ్ళకు మిగిలింది కేవలం పదిహేనువేలు అప్పు నీడనిచ్చే ఆ యిల్లు మాత్రమే తన కొడుకు బోలెడంత సంపాదిస్తున్నాడు గనుక అప్పు తీర్చడం పెద్ద కష్టం కాదనుకున్నాడు జానకీరామయ్య

కానీ ఆయన అంచనాలూ ఊహలూ తలక్రిందులై పోయాయి రమణ నుండి వచ్చే డబ్బు మొత్తం ఉత్తరాల సంఖ్య చాల వరకు క్రమంగా తగ్గిపోయింది అప్పు పడిన కట్నం డబ్బు గురించి జానకీరామయ్య ఉత్తరాల్లో ఎన్నిసార్లు రాసినా రమణ దాన్ని పట్టించుకునే వాడు కాదు సంవత్సరం గడిచిపోయింది

సుగుణను వాళ్ళ అత్తయ్య పుట్టింటికి వెళ్ళగొట్టింది జానకీరామయ్య గాబరా పడిపోయాడు కొడుకు ఉద్దేశ్యం ఏమిటో ఆయనకు



అవగతం కావడం లేదు తాడో పేడో తేల్చుకొందామని ఆయన నిర్ణయించుకున్నాడు వెంటనే కరణాన్ని వెంట పెట్టుకుని గంగా కావేరి ఎక్స్‌ప్రెస్‌లో జబల్‌పూర్‌కు బయలుదేరాడు జానకిరామయ్య

జబల్‌పూర్‌లో అడుగు పెట్టిన అరగంటలోనే సత్యం తెలుసుకున్న జానకిరామయ్య శిలలా బిగుసుకుపోయాడు అతడిలో మానవజాతి పైనున్న విశ్వాసం అడుగంటి పోయింది పర్వతాలను సహితం కుదిపెయ్యగలిగిన రమణా! అనే శోక జానకిరామయ్య గుండెల్లోంచి ఉబికి వచ్చి అతడి గొంతులోనే సమాధి అయిపోయింది

నేనూ ఒకింటి వాడినయ్యాను నా కిష్టమైన అమ్మాయిని నేను పెళ్ళి చేసుకున్నాను మీకు ముందు చెబితే ఈ కులాంతర వివాహానికి మీరొప్పుకోరని నాకు తెలుసు ఇప్పుడు మేము కాపురం కూడా పెట్టేశాం మాకూ ఖర్చులుంటాయి ఇక మీకు డబ్బు పంపడం నావల్లా కాదు ఒక్క పైసా కూడా నేనిక మీకు పంపలేను

రమణ అలా మాట్లాడుతుంటే ఇతడు తన కొడుకేనా అన్పించింది జానకిరామయ్యకు ఎంతగా మారిపోయాడు వీడు! వీడిలో దారుణమైన ఈ మార్పు ఎలా సంభవించిందీ? ఆఖరికి కొడుకూ తండ్రి మధ్య వుండవలసిన పవిత్రమైన అనుబంధం కూడా ఆర్థిక సంబంధాల చట్రంలో యిరుక్కుపోయిందన్న మాట

జబల్‌పూర్ నుండి తిరుగు ముఖం పట్టారు కరణం జానకిరామయ్య రైల్లో కూర్చుని కిటికీ లోంచి బయటకు చూస్తూ జన సమ్మర్దంతో కూడుకున్న ఈ అనంత ప్రపంచంలో మనిషెప్పుడూ ఒంటరి వాడే అని మనసులో అనుకున్నాడాయన సుగుణ మనసులో మెదలగానే జానకిరామయ్య కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి

జబల్‌పూర్‌లో మోటార్ స్టాండ్ అనే ఓ ప్రాంతం వుంది అక్కడే వున్న దాల్‌చంద్ నారాయణ్‌దాస్

# విలాపాగ్నులు

జైన్ కాలేజి కి పక్కన సహీద్ భగత్‌సింగ్ స్మారక భవన్ అనబడే ఓ భవనం వుంది జబల్‌పూర్‌లోని తెలుగు అసోసియేషన్ వాళ్ళు అప్పుడప్పుడు ఆ భవనంలో కల్చరల్ ప్రోగ్రామ్స్ జరిపిస్తుంటారు ఆ సందర్భంలో ఆ సిటీలోని తెలుగు వాళ్ళంతా అక్కడ కలుసుకుని పరిచయాలు చేసుకుంటూ వుంటారు

ఓ సారి రమణకు పద్మ అనే తెలుగమ్మాయి అక్కడే పరిచయమైంది పద్మవాళ్ళు పాతికేళ్ళ క్రితం ఆంధ్ర నుండి వచ్చి యిక్కడే స్థిర పడిపోయారు రమణకు పద్మతో ఏర్పడ్డ పరిచయం క్రమంగా ప్రేమగా మారడం వాళ్ళ ప్రేమని పద్మ తల్లి తండ్రులు అంగీకరించడం జరిగింది పద్మ మెడిసన్ ఆఖరి సంవత్సరం చదువుతోంది

పద్మని పెళ్ళి చేసుకుంటే యిద్దరినీ అమెరికాకు పంపించే ఏర్పాటు కూడా చేస్తామని పద్మ తల్లితండ్రులు రమణకి ఆశ కూడా చూపారు కులాలు వేరు కనుక తన తల్లి తండ్రులు ఆ పెళ్ళికేమాత్రం ఒప్పుకోరని రమణకు తెలుసు అందుకే చెప్పకుండా రమణ పద్మని పెళ్ళి చేసుకుని వేరు కాపురం పెట్టాడు తన తల్లి తండ్రులకు డబ్బు పంపించేందుకు రమణ చేసిన ప్రయత్నాన్ని పద్మ విఫలం చేసింది

కరణం ద్వారా విషయం తెలుసుకున్న యశోదమ్మ బావురమంది సుగుణ కూడా కన్నీళ్ళు కుక్కుకొంది

ఎందుకు మీరలా ఏడవడం? నేనింకా బ్రతికే వున్నాను వాడు దబ్బివ్వక పోయినంత మాత్రాన మనం బ్రతకలేమా? సుగుణను అత్తవారింటికి పంపలేనా? ఈ యిల్లు అమ్మేస్తాను పొలాన్ని కౌలుకు తీసుకుని వ్యవసాయం చేస్తాను బిడ్డల్ని పెంచాలే తప్ప వాళ్ళపై ఎలాంటి ఆశల్ని పెట్టుకోకూడదే – అంటూ బార్యని ఓదార్చాడు జానకీరామయ్య

తండ్రి నిర్ణయం విన్న సుగుణ తన వల్లి యిన్ని బాదలు వచ్చాయని బావించి ఉదయం కల్లా బావిలో శవమై తేలింది కూతురి శవాన్ని కౌగిలించుకుని బావురమంది యశోదమ్మ తన చెల్లెలి మరణ వార్తని టెలిగ్రాం ద్వారా తెలుసుకున్న రమణ దహనక్రియలకు హాజరయ్యే అవకాశం అప్పటికే దాటిపోయింది గనుక కర్మకాండలకి తొమ్మిదవ రోజు వచ్చి చెల్లెలి కోసం కన్నీళ్ళు పెట్టుకున్నాడు

కొడుకును చూడగానే జానకిరామయ్య రెచ్చిపోయాడు ఒరేయ్! ఎందుకొచ్చా విక్కడికి? ఏ ముఖం పెట్టుకుని మళ్ళీ యిటొచ్చావు? వెళ్ళు యింకెప్పుడూ రాకు నిజంగా నీ ఒంట్లో నారక్తమే ప్రవహిస్తుంటే మళ్ళీ ఈ చాయలకు రావు నీ ముఖం యిక చూపించవ్వు నీలాంటి కొడుకు ఏ తండ్రికి పుట్టకూడదు

జానకిరామయ్య గారూ! మీరు అనవసరంగా ఆవేశ పడకండి జరిగిందేదో జరిగిపోయింది ఇక అదంతా తవ్వుకోవడం ఎందుకు? – సర్ది చెప్పబోయాడు కరణం

కరణం గారూ! వీడు మాకు చెప్పకుండా పెళ్ళి చేసుకున్నాడనీ గానీ పెళ్ళాం చేతల్లో వుంటూ మాకు డబ్బులు పంపించడం లేదని గానీ నాకు వీడిపై ఎలాంటి కోపమూ లేదండి ఎవడి జీవితం వాడిది కొడుకైనంత మాత్రాన వీడి జీవితాన్ని నేను శాసించను కానీ నా కూతురిని చంపే అధికారం వీడి కెక్కడుందండి? ఆ రోజు ఆ సంబందం నిశ్చయించింది కట్నం అప్పు పెట్టింది వీడు కాదూ? ఆ రోజు కట్నం సంగతి నాకు వదిలెయ్యండని వీడు గొప్పలు చెప్పకుండా వుండి వుంటే మాకు తగిన సంబంధం మేము చూసుకునే వాళ్ళం గదా అది బావిలో పడి చచ్చిందంటే కారణం వీడు ఇలాంటి దౌర్భాగ్యుడికి చెల్లెలిగా పుట్టడం దాని దురదృష్టం మాకు వీడు కొడుకుగా పుట్టడం అది మా దురదృష్టం వెళ్ళిపోరా! నీ పాపిష్టి ముఖాన్ని మాకు చూపెట్టకు – అంటూ ఉద్రేకంతో ఊగిపోయాడు జానకిరామయ్య

అంతే తండ్రి మాటలతో రోషం పుట్టి ఆనాడు వెళ్ళిపోయిన రమణ మళ్ళీ యిప్పటి వరకు తల్లితండ్రుల ముఖం చూడలేదు యశోదమ్మ ఎన్ని ఉత్తరాలు రాసినా రమణ నుండి ఒక్క ఉత్తరానికి కూడా బదులు రాలేదు చివరకు తండ్రి చావు బ్రతుకుల నడుమ వున్నాడని నిన్నే కలవరిస్తున్నాడని ఉత్తరాలు ఎన్ని రాసినా టెలిగ్రాం యిచ్చినా రమణ రాలేదు

★ ★ ★ ★ ★

ఆ యింటి వరండాలో స్తంబానికి ఆనుకుని కూర్చుని వున్న యశోదమ్మకు యింటి గేటును ఎవరో నెట్టుతున్నట్టు శబ్దం విన్పించింది 'రమణ మన రమణ వచ్చాడండి అంటూ గట్టిగా బర్తతో చెప్పబోయిన యశోదమ్మ ఎదురుగా కన్పించిన ఆ దృశ్యాన్ని చూడగానే మూగదైపోయింది

అక్కడ ఆ యింటి గేటును మెల్లగా కొమ్ములతో నెట్టుకుంటూ ముసలి ఎద్దు ఒెండు లోపలికి






### కె ఎ కె పాలకొల్లు

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను మా దూరపు బంధువే కాని వాళ్ళు అంతస్తు కలవాళ్ళు నాది మిడిల్ క్లాస్ ఈ మాట అడిగితే మౌనం వహిస్తూంది ఏం చెయ్యమంటారు?

● మౌనం అర్ధాంగీకారం అని మటుకు అనుకోవద్దు' తరవాత బాధపడతారు? మీ మనసులో అంతస్తు లెక్క ఎప్పుడొచ్చిందో - అప్పుడే ప్రేమ సంగతి మరిచి పోయి వుండాలి

### బి ఎన్ ఆర్ బెంగుళూరు

★ కొందరు నన్ను అన్యాయంగా జైలుకి పంపారు దగ్గరలో విడుదల కాబోతున్నాను నన్ను జైలుకి పంపిన ఆ దౌర్జన్యపరులని ఏమేమో చేయాలనుకున్నాను దానికి మీ సలహా ఏమిటి అక్కా?

● నువ్వు తప్పు దారిన ఆలోచిస్తున్నావు తమ్ముడూ దౌర్జన్యపరులు - ఒకసారి నిన్ను దెబ్బతీశారు మళ్ళీ ఎందుకు వారి జోలికి పోవడం? దుష్టులకి దూరంగా వుండాలన్న సంగతి మరిచిపోతే ఎలా? వచ్చి కొత్త జీవితానికి నాంది పల్కు నా సలహా అదే కక్ష తీర్చుకోవడం సహజం కాని క్షమించ కల్గడం ఔన్నత్యం

### ఎల్ జి ఆర్, కె ఆర్ ఎన్ గుంటూరు

★ ప్రేమగుడ్డిది అయితే మరి చెవిటి వారు మూగ వారు ఎవరు?

● మగవారు కాదా??

### ఎస్ ఎన్ నారాయణపేట

★ హిందువుల ఏకత ఎందుకు చెడిపోతోంది?

● డైవర్సిఫికేషన్ ఆఫ్ గాడ్స్- ఐక్యతని చెడుపుతున్నారు దేవుడొక్కడే అంటూ యిన్ని రూపాల్లో వుంటే - ఎలా?!

### బి ఎస్ ఆర్ ఇచ్ఛాపురం

★ ది క్రిమ్ ఆఫ్ సొసైటీ యీజ్ ది యూత్ ఆఫ్ ది డే?

● ఎస్ అందుకే కద ఇంత అజీర్ణం!

### బి ఎల్ రాజమండ్రి

★ పురుషాదిక్యతగల యీ సమాజంలో భర్తకి ఉన్నత సన్మాన సత్కారాలు జరుగుతూంటే భార్య సంతోషం వర్ణనాతీతంగా వుంటుంది అలాగే భార్యకి సన్మానాలు సత్కారాలు జరుగుతూ వుంటే భర్తకి అలాగే వుంటుందా?

● ఉండదు దీనిలో ఏముందని చెప్మా! దీనికి సన్మానం చేస్తున్నారు? అనుకోవచ్చు సన్మానాలు చూడ్డానికి రాడానికి సిగ్గుపడవచ్చు- చెప్పలేం! కూడావుండి దండలు మోసేవాళ్ళూ వుంటారు- వారు భార్యలనే సూర్యుల వెనుక వెళ్ళేవాళ్ళు అని శూరులనుకునే మగాళ్ళు అనుకుంటూ వుంటారు వెళ్ళక్కర లేదులే ఒప్పుకోకు అంటూ ముందు జాగ్రత్త పడేవాళ్ళూ వుంటారు నా ముప్పయి మూడేళ్ల సాహితీరంగ అనుభవంలో - నేను చాలా రకాల వాళ్ళని చూశాను చూస్తున్నాను!

### స్వప్నసుధ విజయవాడ

★ మీరు బెదిరించినట్లు భూతంలా లేరు మీ వెండి జుట్టు మీ కెంత హుందా నిచ్చిందో గమనించారా?

● ఏం లాభం? నా స్నేహితులని బిత్రీ చేస్తూందంటున్నారు!

### బి ఆర్ బి కోరుకొండ,

★ పోలీసువారు కాకీ బట్టలే ధరిస్తారెందుకు?

● మాసినా తెలియకుండా వుంటాయని!

### వి కె ఆర్ వి హైదరాబాదు

★ కె అంటే!

● కూచి!!

### ఎస్ వి, సంగంజాగర్లమూడి

★ దేవుని ఎదుట ప్రమాణం చేసి నిజం చెప్పండి, ఆడవాళ్ళు సిగ్గు నటిస్తారు కదూ?

● ఈ మాత్రానికి దేవుణ్ణి లాగుతా వెందుకయ్యా? ఆడవాళ్ళకి సిగ్గు సహజమే నటించవలసిన అవసరం మగవాళ్ళకే

### బి ఎన్ వి పి, నెల్లూరు

★ మీ ప్రశ్నావళి నాకు బాగా నచ్చింది పక్షపాతం లేకుండా జవాబులిస్తారు మెనీ థాంక్సు సూపర్ స్టార్ కృష్ణ గారిపై మీ అభిప్రాయం?

● మీరే అంటున్నారుగా సూపర్ స్టార్ అని సూపర్ స్టారే కాదు మంచి మనిషి కూడా

### బి కె ఆర్, సోంపేట

★ మాంగల్యానికి మనసుకి వున్న పవిత్రతలో ఎది గొప్పది? హైందవ సంప్రదాయంలో మాంగల్యానికి అంత ప్రాధాన్యం ఎందుకిచ్చారు?

● ఆడదాని పవిత్రత మీదనే వంశ పవిత్రత ఆధారపడి వుంది గనుక □

---

వస్తున్నాయి వాటిని చూడగానే, చాలా ఏళ్ళ క్రితం తమ యింట్లోంచి అమ్మకంపై వెళ్ళిపోయిన కోడెలే అవి అని యశోదమ్మ సులభంగానే గుర్తుపట్టగలిగింది ఆ దంపతుల లాగే ఆ కోడెలు కూడా ముసలివైపోయాయి

లోపలికి వచ్చిన ఆ ఎద్దులు యశోదమ్మ ముందు నిలబడ్డాయి అందులో ఒక ఎద్దు యశోదమ్మ చేతిని నాలుకతో మెల్లగా నాకసాగింది వెంటనే యశోదమ్మ తన కుడి చేతిని ముందుకు చాపి గంగడోలును దువ్వ సాగింది మరో ఎద్దు ఆ మంచం మీద పడుకుని మూలుగుతున్న ఒకనాటి తమ యజమాని జానకీరామయ్య వేపు పరామర్శిస్తున్నట్లుగా చూడసాగింది

అవసాన దశలో తండ్రిని చూడడానికి రాకుండా వుండేందుకు వాడేమైనా మనసూ మమకారాలూ లేని పశువు గానీ అనుకున్నావా? - అని తన భర్తను ఓదారుస్తూ నాలుగు గంటల క్రితం ఆ వరండాలో శంకరయ్య అన్న మాటలు హఠాత్తుగా యశోదమ్మ స్మృతిపథంలో మెదిలాయి

మనుషులలోనూ జంతు స్వభావం గల వాళ్ళు వుండొచ్చు అందుకు తార్కాణం తన కన్నకొడుకే జంతువులలోనూ మనసూ మమకారాలు గల జీవాలు వుండొచ్చు అందుకు తార్కాణం ఈ పశువులు

నోరూ వాయీ లేని ఈ పశువులు గడ్డి తినే ఈ పశువులు తన కొడుకు చదువు కోసం ఈ యింట్లోంచి అమ్ముడుపోయాయి అయినా యిప్పటికీ ఈ యింటి పరిసరాలనూ ఈ యింట్లోని వ్యక్తులనూ యివి మరిచి పోలేకపోయాయి

కానీ నవమాసాలు మోసి కని పెంచి పెద్ద చేసిన తన కొడుకు ఈ యింటిని విస్మరించాడు ఏ తల్లితండ్రులు కాశీ ప్రయాగాది పవిత్ర భూముల కంటే విమలతరమో ఆ తల్లితండ్రులనే పూర్తిగా విస్మరింపగలిగాడు

ఇహ పరాలను సాధించే హితమిచ్చిన తండ్రి చావు బ్రతుకుల నడుమ ఉన్నాడని తెలిసినా ఆ తండ్రిని ఆఖరి చూపైనా చూడడానికి కొడుకు రాలేకపోయాడు

ఆ ఉదయం యశోదమ్మ వాళ్ళింటికో వృద్ధుడు వచ్చాడు గతంలో మూడు వేల రూపాయలను జానకీరామయ్య కిచ్చి ఆ ఎడ్లను పట్టుకుపోయిన మనిషతడు

రాత్రి వేరుశెనక్కాయల బస్తాలను ప్రక్కవూర్లో కొని వాటిని తీసుకుపోదామని బండి కట్టుకుని ప్రక్కూరికి వచ్చానమ్మా ఎద్దుల్ని చెట్టుకి కట్టేసి నేను పని మీద వూళ్ళోకి వెళ్ళి వచ్చేసరికి ఎద్దులక్కడ లేవు పగ్గాలు తెంపుకుని ఎటో పోయాయి ఆ వూరి పొలాల్లో రాత్రంతా వెదికాను

ఎప్పుడో మీ యింట్లోంచి కొనుక్కుపోయిన ఎద్దులు గదా వాడుక తప్పకుండా మీ యింటి కొచ్చాయెమో అని యిటు వచ్చానమ్మా - అన్నాడతడు కన్నబిడ్డ గుండెని కరిగించలేని ఆ తల్లితండ్రుల విలాపాగ్నులు పశువుల గుండెల్ని కరిగించగలిగాయి పెరట్లో గడ్డి తింటున్న ఆ పశువులను ఆ వృద్ధుడికి చూపెట్టింది యశోదమ్మ

□

# సాక్షి

శర్వరమణప్రసాద్

(గత సంచిక తరువాయి)

మైత్రేయి భారంగా నిట్టూర్చింది

జరగవలసింది జరిగిపోయాక యింకేది దాచి ప్రయోజనంలేదు నేనా వార్త చెప్పగానే కళ్యాణ్ ఆనందంతో ఎగిరి గంతేస్తాడనుకున్నాను కాని దానికి బదులుగా అతను నా ముందు మోకాళ్ళ మీద మోకరిల్లి నన్ను ఉద్వేగంగా వాటేసుకున్నాడు ఏమి తోచని అయోమయంలో పడిపోయాన్నేను మైత్రి నువ్వు మనిషివి కావు దేవతవు నాకు ప్రాణం పోసింది నువ్వే మోడు వారిపోతున్న ఈ జీవితాన్ని చిగురింపజేసింది నువ్వే ఆరిపోతున్న ఈ దీపానికి చేతులడ్డం పెట్టి కాపాడింది నువ్వే నువ్వెదురుగా వుండబట్టే నేను బ్రతికాను నువ్వెదురుగా వుంటేనే నేను ముందు ముందు జీవించగలను నీ మాటలు వింటున్నప్పుడు నీ మోము చూస్తున్నప్పుడు నాలో ఏదో తెలియని ఉత్సాహం ఉత్తేజం కలుగుతూంటాయి అందుకే శాశ్వతంగా నువ్వు నా ఎదురుగా వుండేందుకు నిన్ను నా జీవిత భాగస్వామిగా చేసుకోవాలనుకుంటున్నాను మైత్రి ప్లీజ్ కాదనకు ఈ అల్పుడు కోరుతున్న ఈ చిన్న కోరికని మన్నించు అంటూ వలవలా విలపించసాగాడు నాకు తల తిరగసాగింది ఏమని సమాధానమివ్వాలతనికి నేనానంద్‌ని యిదివరకే ప్రేమించానని త్వరలో వివాహం చేసుకోబోతున్నానని కాబట్టి నామీద ఆశలు పెంచుకోవద్దని చెప్పాలా? అలా చెప్తే అతనేమవుతాడో? నేనిలాంటి విషమ సందిగ్ధంలో పడి కొట్టుమిట్టాడుతున్న తరుణంలో గదిలో అడుగు పెట్టాడు ఆనంద్ అతన్ని చూడగానే నన్నొదిలేసి తత్తరపాటుతో లేచి నించున్నాడు కళ్యాణ్ ఆనంద్‌దగ్గరికెళ్ళి అతన్ని కావలించుకున్నాడు డాక్టర్ మీరిద్దరూ చేసిన సేవలు నేను జన్మలో మరిచిపోలేను మీ యిద్దరికీ ఆజన్మాంతం ఋణపడి వుంటాను అన్నాడు కృతజ్ఞత ఉట్టిపడే గొంతుతో ఆనంద్ కూడ ఆప్యాయంగా అతని భుజం తట్టుతూ ఇందులో నేను చేసిందేమి లేదు నేనిచ్చిన మందులకన్నా మైత్రేయి మీ పట్ల చూపించిన శ్రద్ధవల్లే మీరు కోలుకోగలిగారు అని అతనితో అని చిర్నవ్వుతో నా వంక చూసాడు మైత్రి ఓ మారిలారా అంటూ కళ్యాణ్‌ని మళ్ళీ కలుస్తానని చెప్పి నన్ను తన కన్సల్టింగ్ రూంలోకి తీసుకెళ్ళాడు ఇద్దరం ఎదురెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాం ఆనంద్ ఏం చెప్పబోతున్నాడోనని నా గుండె వేగంగా కొట్టుకోసాగింది అతను మాత్రం తన శాంత గంభీర స్వరంతో అతి నెమ్మదిగా మాట్లాడాడు మైత్రి ఈ హాస్పిటల్లో నర్సుగా చేరినప్పుడు నువ్వో ప్రమాణం చేసావు గుర్తుందా' రోగులకి మనస్ఫూర్తిగా సేవ చేస్తానని చివరి వరకూ వారి ప్రాణాలని రక్షించడానికే ప్రయత్నిస్తానని ప్రమాణం చేసావు ఇప్పుడా ప్రమాణం నిలబెట్టుకోవలసిన సమయం వచ్చింది మైత్రి యిందాక కళ్యాణ్ గదిలో అతను నీతో మాట్లాడిన మాటలన్నీ విన్నాను అతనన్న ప్రతి మాట అక్షరాల నిజం మైత్రి! నీకు తెలుసో తెలీదో అతని జబ్బు పూర్తిగా నయమవడానికి కారణం నువ్వే నీకీ విషయం నమ్మలేనిదిగా కన్పించవచ్చు కాని ఒక డాక్టరుగా చెప్తున్నాను విను బ్లడ్ కేన్సర్‌ని శాశ్వతంగా నివారించగల మందులేవీ ఈ దేశంలోకి యింకా రాలేదు కాని కళ్యాణ్ జబ్బు పూర్తిగా నయమయింది ఎలా' వైద్యశాస్త్రం నిరాశ చేసుకుని వదిలేసిన కొన్ని రోగాలని ఫెయిత్ హీలర్స్ నయం చెయ్యడం గురించి నువ్వు వినే వుంటావ్ కొందరి వ్యక్తిత్వాలలో ఏదో దివ్యత్వం ప్రవేశించి వారి ద్వారా యిటువంటి రోగాలని నయం చేయిస్తుంది మైత్రి ముఖస్తుతితో నిన్నాకాశానికి ఎత్తేస్తున్నాననుకోకు ఎలాసం చదవడంవల్లో నర్సుగా మానవసేవ చేయడం వల్లో మరెందువల్లో కాని నలో కూడ అటువంటి శక్తి చోటు చేసుకుంది ఆ శక్తివల్లే కళ్యాణ్ రోగం నయమయింది అయితే అతనింకా మానసికంగా చాల బలహీనంగా వున్నాడు అందుకే చిన్నపిల్లాడిలా యివాళ నీ దగ్గర ప్రవర్తించాడు అతన్ని పూర్తిగా మనిషిని చేసే బాధ్యత నీమీద వుంది ఆ బాధ్యతని నిర్వర్తించు నువ్విప్పుడేమాత్రం అతన్ని తిరస్కరించినా మనం యిన్నాళ్ళూ చేసిన ప్రయత్నం బూడిదపాలవుతుంది నిరాశతో అతను మరణించవచ్చు కాబట్టి అతని కోరికను మన్నించు అతను కోరిన విధంగా అతన్ని వివాహం చేసుకో

ఆనంద్ షాక్ తిన్నట్టుగా చూసానతని వైపు

నన్ను వారిస్తున్నట్టుగా చేత్తోనే సౌంజ్ఞ చేశాడు ఆనంద్

మైత్రి నువ్వడగబోతున్నదేమిటో నాకు తెలుసు నేను నీకేమి కానా అని అడగబోతున్నావ్ కదూ మైత్రి కళ్యాణ్‌కి నువ్వెలాగ దేవతలాగ కన్పిస్తున్నావో నా కళ్ళకి అలానే కన్పిస్తున్నావు నా జీవితాంతం నా హృదయంలో నీకు తప్ప మరొకరికి స్థానముండదు మరో జన్మంటూ వుంటే అప్పుడు తప్పకుండా మనిద్దరం ఒకటవుదాం ఇప్పుడు మాత్రం నా అభ్యర్థనని కాదనకు ఆర్తితో అలమటిస్తున్న అతని హృదయానికి ఓదార్పు కలిగించి అతన్ని తిరిగి మనిషిగా చెయ్యి చిరునవ్వు నవ్వాలని ప్రయత్నించిన ఆనంద్ హృదయంలోని నిజాయితీకి ప్రతీకగా అతని కళ్ళలో నీరు నిలిచింది నేనింకేమి మాట్లాడలేకపోయాను కళ్యాణ్ రోగం నయం చేయలేకపోతే డాక్టరుగా ప్రాక్టీసు మానేస్తానన్న ఆనంద్ ప్రతిజ్ఞ నాకు గుర్తుకొచ్చింది అతని ఆదర్శానికి విజయం లభించేలాగ నా జీవితాన్ని మలచుకోదలుచుకున్నాను ఆ తర్వాత కొన్నాళ్ళకే కళ్యాణ్‌తో నా వివాహం జరిగిపోయింది అప్పుడు మీరందరూ హాజరయ్యారుకూడ

మీరెప్పుడూ ఈ బెడ్ రూంలోనే పడుక్కుంటారా? ఊహించని రీతిలో విజయ్ అడిగిన ప్రశ్నకి తృళ్ళిపడి అతని కళ్ళలోకి చురుగ్గాచూసింది మైత్రేయి

మేమిప్పటి వరకూ సంసారం చెయ్యలేదు అంది నెమ్మదిగా

దిసిజ్ ఎ స్ట్రేంజ్ న్యూస్ టు మి అన్నాడు విజయ్ కళ్ళు పెద్దవి చేసి

మైత్రేయి చూపులు కిందకి వాలిపోయాయి

దానిక్కూడా కారణం నేనే కళ్యాణ్‌ని వివాహమైతే చేసుకున్నాను కాని నా మనస్సులోంచి మాత్రం ఆనంద్‌ని తొలగించుకోలేక పోయాను అందుకే కళ్యాణ్‌తో చిన్న అబద్ధం ఆడేను అతని రోగం పూర్తిగా నయమయిపోయినా వీక్‌నెస్ బాగా వుందనీ కాబట్టి అతను ఆర్నెల్ల వరకూ బాగా రెస్ట్ తీసుకోవాలని డాక్టర్ ఆనంద్ నాతో ప్రత్యేకించి చెప్పాడని అతన్ని నమ్మించాను అదెంత పొరపాటో యిప్పుడర్థమయింది

జరిగినకథ–2 కళ్యాణ్ పెద్ద జమీందార్ అతని భార్య మైత్రేయి ఆమె చాలా అందగత్తె కళ్యాణ్ ఏదో అర్జంటు విషయం చర్చించటానికి రమ్మంటే కళ్యాణ్ ఉండే గ్రామానికి వస్తాడు డి ఎస్ పి విజయ్ విజయ్ వచ్చేటప్పటికే డాక్టర్ ఆనంద్ లాయర్ ప్రకాష్ బ్యాంకు మేనేజరు శామ్యూల్ కూడా అక్కడికి వచ్చి ఉంటారు లాయర్ ప్రకాష్ మంచి ఆర్టిస్టు అందరూ కలసి సరదాగా కాలక్షేపం చేస్తారు మాటల మధ్యలో మర్నాడు ఏదో ఆశ్చర్యకరమైన సంఘటన జరగబోతోందని చెప్తాడు కళ్యాణ్ అర్జంటుగా ఏదో మాట్లాడాలని రాసిన కళ్యాణ్ ఆ విషయం ఏం చర్చించక పోవడం విచిత్రంగా ఉంటుంది విజయ్‌కి అతను రాత్రి పడుకోబోయే ముందు మర్నాడు కళ్యాణ్‌తో చెప్పి తిరుగు ప్రయాణమై వెళ్ళి పోదామనుకుంటాడు మర్నాడు ప్రొద్దున నిద్ర లేచేటప్పటికి డాక్టర్ ఆనంద్ దుర్మరణం పాలయి ఉంటాడు ఆనంద్ పని చేసే హాస్పిటల్‌కి లోకల్ పోలీస్టేషన్‌కి ఈ విషయం ఫోన్‌చేసి చెప్పమని కళ్యాణ్‌తో చెప్తాడు విజయ్ పోలీసు లొచ్చేలోపల తన ఇన్వెస్టిగేషన్ మొదలు పెడతాడు మైత్రేయి తనకి కళ్యాణ్‌కి మేరేజ్ ఏ పరిస్థితులలో జరిగిందో చెప్పసాగింది

"ఎలా?"

"సరిగ్గా వారం రోజుల క్రితం ఏదో పనిమీద కల్యాణ్ నా గదిలోకి వచ్చాడు. ఆ సమయంలో నేను బాత్రూంలో స్నానం చేస్తున్నాను. ఎప్పుడూ లేంది ఆ రోజు నా వార్డ్రోబ్ తెరిచాడు కల్యాణ్. అందులో ఆనంద్ నాకు రాసిన ఉత్తరాల కట్ట, నా డైరీ అతని కళ్ళబడింది. నేను స్నానం ముగించి వచ్చేలోగానే అతనికి పరిస్థితి పూర్తిగా అర్థమయిపోయింది. నేనార్నెల్ల వ్యవధి ఎందుకు పెట్టానో కూడ అర్థమయింది. 'మైత్రీ నేను నీకు చాల అన్యాయం చేసాను' అన్నాడు నేను బాత్రూం నుంచి పైకి రాగానే. మొదట్లో తెల్లబోయినా అతని చేతిలో వున్న ఉత్తరాల కట్ట చూసిన తర్వాత జరిగిందేమిటో ఊహించుకోగలిగాన్నేను. అప్పుడింక నటించి లాభంలేదు. అయినా అతి కష్టం మీద మనస్సు సంబాళించుకున్నాను.'మీరు చూసిందంతా పాత కథ ... ప్రస్తుతం ఆ ఉత్తరాలకీ నాకూ సంబంధంలేదు' అన్నానెలాగో గొంతు పెగుల్చుకుని. కల్యాణ్ ఉత్తరాల కట్ట వార్డ్రోబ్‌లో పెట్టేసి వెనక్కి తిరిగాడు. 'మైత్రీ... నేను నిన్ను అనుమానించడం లేదు. కాని నేను చేసిన ఘోరమైన పొరబాటుకి చింతిస్తున్నాను. చావుకి చేరువైన నన్ను అభిమానంతో ఆదరించి అహర్నిశలూ సేవ చేసి పునర్జన్మ ప్రసాదించిన మీకు కృతజ్ఞుడనై వుండడానికి బదులు మీ యిద్దరినీ విడగొట్టి నాకు తెలీకుండానే పాపానికి ఒడిగట్టాను. అయినా యిప్పుడు మించిపోయిందేమీ లేదు. బెటర్ లేట్ దేన్ నెవర్... కొద్దిగా ఆలస్యమైనా నేను చేసిన పాపాన్ని ప్రక్షాళన చేసుకుంటాను.. త్వరలోనే అందరి సమక్షంలో ఆనంద్‌తో నీ వివాహం జరిపిస్తాను..' అన్నాడు నిర్లిప్తంగా. నాకు దుఃఖం ఆగలేదు. రెండు చేతులలో మొహం దాచుకుని విలపించసాగాను. 'ప్లీజ్... అలాంటి నిర్ణయం చేయవద్దు' అని కల్యాణ్‌ని ప్రాధేయపడాలనిపించింది. కాని నాలో ఏదో బలహీనత నా నోరు నొక్కేసింది. కొద్ది క్షణాలాగి తిరిగి అతనే మాట్లాడేడు... 'మైత్రీ... మనిద్దరం విడిపోయే ముందు నాదో చిన్న కోరిక... నాకు తెలిసిన మిత్రుడొకడున్నాడు.. మంచి ఆర్టిస్ట్.. అతని చేత నీ చిత్తరువొకటి గీయించి నా దగ్గర పదిలపరుచుకుంటాను. అది నా ఎదుట వున్నంత కాలం నా జీవితానికి ఎటువంటి హానీ కలగదు... ప్లీజ్ ఈ చిన్న కోరికని మాత్రం కాదనకు' అనేసి నా సమాధానం కోసం కూడ ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు. ఆ రోజే మీ అందరికీ



ఉత్తరాలు రాసేశు రమ్మనమని ప్రకాష్ శామ్యూల్ రెండు రోజులు ముందుగా వచ్చేరు ప్రకాష్‌ని నా చిత్రం గియ్యమని అభ్యర్థించాడు కల్యాణ్ ప్రకాష్ అతని అభ్యర్థనని వెంటనే మన్నించాడు నా చిత్రం గియ్యడం మొదలుపెట్టాడు మర్నాడు రాత్రి వచ్చేడు ఆనంద్ ఆ మర్నాడు ఉదయం వచ్చేరు మీరు తరువాత జరిగిన విషయాలన్నీ మీకు తెలుసు ఇవాళ ఉదయం కల్యాణ్ మీతో చెప్పానన్న స్వీటెన్ న్యూస్ కూడ మరేమీ కాదు తన నిర్ణయాన్ని ముందుగా మీకు తెలియబరిచి మీ సమ్మతి పొందడం

నిన్న రాత్రి పార్టీ అయిన తర్వాత మీరు ఆనంద్‌ని కలిశారా? అడిగాడు విజయ్

ఆ కలిశాను అతని రూమ్‌లోనే కల్యాణ్ ఉద్దేశం అతనికి చెప్పాను అది విన్న ఆనంద్ చాల బాధ పడ్డాడు అటువంటి నిర్ణయం మంచిది కాదనీ తను కల్యాణ్‌కి నచ్చజెప్తాననీ చెప్పాడు కల్యాణ్ వంటి ఉత్తముణ్ణి భర్తగా పొందినందుకు గర్వపడాల్సింది పోయి అతనికి దూరంగా మసలడానికి ప్రయత్నించడం భావ్యం కాదని నన్ను మందలించాడు ఎటువంటి బలహీనతలకి లోనుకాకుండా నిర్మలమైన హృదయంతో కల్యాణ్‌ని ప్రేమించడానికి ప్రయత్నించమన్నాడు తను ఒకసారి తీసుకున్న నిర్ణయానికి తిరుగుండదనీ కాబట్టి జీవితాంతం తనని నా మంచిని కోరే ఒక స్నేహితుడిగా మాత్రమే భావించమని కోరాడు

మీరు ఆనంద్ రూంకి ఎన్ని గంటలప్పుడు వెళ్ళి వుంటారు?

పార్టీ ముగిసిన ఒక గంట తర్వాత అంటే రాత్రి పన్నెండయి వుండవచ్చు

మీరతని రూంకి వెళ్తుండగా ఎవరైనా చూసారా?

లేదు కల్యాణ్ తన గదిలో తలుపేసుకుని పడుకున్నాడు ప్రకాష్ గదిలో లైటు వెలుగుతోంది కాని తలుపు చాల దగ్గరగా వేసి వుండడం వల్ల నేనతనికి కనపడే అవకాశం లేదు అయినా నా అనుమానం కొద్దీ అతని రూం దగ్గరకి వెళ్ళి తలుపు సందులోంచి చూసాను అతను నా పెయింటింగ్ వేయడంలో నిమగ్నమయి వున్నాడు

మేడ మీద?

మేడ మీద ఆనంద్ గదిలో మాత్రం లైటు వెలుగుతోంది రాత్రి జరిగిన గొడవ వల్ల అతనింకా తేరుకున్నట్టు లేదు ఏదో యింగ్లీషు నవల చదువుకుంటూ కూర్చున్నాడు పక్కన శామ్యూల్ గదిలో మాత్రం లైటు ...



అతను పడుకున్నట్టున్నాడు మీ సంగతి మీకు తెలుసు

ఎంత సేపటికి తిరిగి వచ్చారు?

దాదాపు అరగంట తర్వాత

మీరు తిరిగొచ్చేసరికి కూడ ప్రకాష్ గదిలో లైటు వెలుగుతోందా?

లేదు లైటార్పేసి వుంది అతను కూడ పడుకున్నట్టున్నాడు

మీ గదికి వచ్చాక మీరేం చేసారు?

స్లీపింగ్ పిల్స్ వేసుకుని పడుకున్నాను తిరిగి ఉదయం కల్యాణ్ వచ్చి లేపే దాక తెలివి రాలేదు

కల్యాణ్ మిమ్మల్ని ఎలా లేపాడు

తలుపు తట్టి లేపాడు చాల సేపు తడితేకాని నాకు తెలివి రాలేదన్నాడు

మీ యింటికి నైట్ వాచ్‌మన్ ఉండాలి కదా ఎమయ్యాడు?

ఏదో పని మీద వారం రోజులు సెలవు కావాలన్నాడు ఎలాగూ మీరందరూ ఉంటారు కదాని వెళ్ళమన్నాడు కల్యాణ్

ఉదయం పనిమనిషి రాలేదా?

వచ్చింది కాని ఆమెకి విషయమంతా తెలిస్తే అనవసరపు గలబా జరుగుతుందని ఆమెకి విషయం చెప్పకుండా పంపించేశాడు కల్యాణ్

కల్యాణ్‌కి మార్నింగ్ వాక్ కి వెళ్ళే అలవాటుందా?

లేదు అంది మైత్రేయి

ఓకే థాంక్యూ చాల విలువైన సమాచారం అందించారు మిగిలిన వారితో కూడ మాట్లాడి అవసరమైతే మీ దగ్గరికొస్తాను అంటూ బయటికి నిష్క్రమించాడు విజయ్

అతని ఉద్దేశమేమిటో అర్థంకాక ఆశ్చర్యంతో అతను వెళ్ళిన వైపే చూస్తూ నిల్చుండిపోయింది మైత్రేయి

* * * * * *

విజయ్ హాల్లోకి వచ్చాడు హాల్లో సోఫాలో విచారంగా కూర్చుని వున్నాడు కల్యాణ్ తెల్లగా తెల్లవారిపోయింది ఇంకా పోలీసులు కాని హాస్పిటల్ వాళ్ళు కాని రాలేదు వాళ్ళొచ్చే లోగానే మిగిలిన వాళ్ళని కూడ ప్రశ్నించాలి అనుకున్నాడు విజయ్

ముందు ప్రకాష్ రూం వైపు నడిచాడు నెమ్మదిగా వేళ్ళతో తలుపు మీద చప్పుడు చేసాడు విజయ్ రెండు నిమిషాల తర్వాత తలుపు తెరుచుకుంది

ఎరుపెక్కిన కళ్ళతో దర్శనమిచ్చాడు ప్రకాష్

హల్లో విజయ్ గుడ్‌మార్నింగ్ ఏమిటి విశేషం యింత ఉదయాన్నే నిద్ర లేపారు?

ఆనంద్ చచ్చిపోయాడు స్థిరంగా అతని కళ్ళలోకే చూస్తూ అన్నాడు విజయ్

ప్రకాష్ కళ్ళు ఆశ్చర్యంగా మారాయి

వ్వాట్! ఆనంద్ చనిపోయాడా ఎప్పుడు? ఎక్కడ? ఎలా?

అవన్నీ తర్వాత చెప్తాను కాని ముందు కొన్ని ప్రశ్నలకి సమాధానమివ్వాల్సి వుంటుంది మీరు మళ్ళీ అదే స్థిరటోన్‌లో అన్నాడు విజయ్ ప్రకాష్ మొహంలో రంగులు మారిపోయాయి

అడగండి అన్నాడు బుజాలెగరేసి

ఇక్కడ కాదు రూంలో అన్నాడు విజయ్

ప్రకాష్ దారి కడ్డు తొలగాడు విజయ్ అతని రూంలో ప్రవేశించాడు

ఎదురుగా ఈజెల్ మీద మైత్రేయి వర్ణ చిత్రం! సందేహం లేదు ప్రకాష్ చెయ్యి తిరిగిన చిత్రకారుడే! చిత్రం ప్రతి అంశంలో సహజత్వం ఉట్టిపడుతోంది

చిత్రం చాల బాగుంది ప్రశంసా పూర్వకంగా అన్నాడు విజయ్

థాంక్స్ ముక్తసరిగా అన్నాడు ప్రకాష్

మీ అభిమాన చిత్రకారు డెవరు?

ప్రకాష్‌కి ఆశ్చర్యమేసింది ఏవేవో తికమక ప్రశ్నలడుగుతాడనుకున్న విజయ్ యిటువంటి మామూలు ప్రశ్నలడుగుతూండడంతో అతను కేవలం స్వంటుకొట్టే పోలీసాఫీసరులా కనిపించాడు ప్రకాష్‌కి

లియొనార్డో డావిన్సీ అతన్నే వేనెక్కువగా స్టడీ చేసాను విజయ్ అడిగిన ప్రశ్నకి సమాధాన మిచ్చాడు

రూమ్‌నంతా పరికించి చూసాడు విజయ్ రూమ్‌లో ఒకే ఒక వస్తువు అతని దృష్టి నాకర్షించింది అది ప్రకాష్ పడుకున్న డబల్‌కాట్‌పై పరచి వున్న తెల్లటి బెడ్‌షీట్ ఆ బెడ్‌షీట్ మధ్యలో అంచుల వద్ద ఎవరో పెయింట్ వేసుకున్న

# కొనకం(త్రి)!

బొమ్మన్










చేతులతో గట్టిగా నలిపినట్టుగా వుంది

రాత్రి మీ రెంత వరకూ వేసారు పెయింట్? అడిగాడు విజయ్

పండెండు వరకు ముగించేక వాచీ చూసుకున్నాను

తర్వాతేం చేసారు?

లైటార్పేసి పడుక్కున్నాను మళ్ళీ యిప్పుడే లేవడం విజయ్ ప్రకాష్ చేతుల వంక చూసాడు శుభ్రంగా వున్నాయవి

దుప్పటి మీద ఆ మరకలేమిటి? చటుక్కున అడిగాడు ప్రకాష్ తుళ్ళిపడి దుప్పటి వంక చూసాడు అంతలో నే తేరుకున్నాడు

ఓ అవా! మరచిపోయి చేతులు కడుక్కోకుండా పడుక్కున్నాను తర్వాత జ్ఞాపకమొచ్చి బాత్రూమ్‌లో కడుక్కుని వచ్చి పడుక్కున్నాను

రాత్రి కాని మీరు డాబా మీదకి వెళ్ళారా?

లేదే! పడుక్కున్న వెంటనే నాకు గాడంగా నిద్ర పట్టేసింది

కల్యాణ్‌కి మీకూ పరిచయం ఎలా ఏర్పడింది?

కల్యాణ్ నేనూ ఒకే బ్యాంకులో కష్టమర్స్‌మి శామ్యూల్ దాని మేనేజరు అతని ద్వారా యిద్దరికీ పరిచయమయింది

ఓకే థాంక్యూ మీరిప్పుడు కల్యాణ్‌తో వెళ్ళి శవాన్ని చూడొచ్చు దయచేసి ఏమీ ముట్టుకోకండి కొద్ది క్షణాల్లో పోలీసులొస్తారు అనేసి బయటికి వచ్చాడు విజయ్ ప్రకాష్ అతని వెనకే హాల్లోకి వచ్చి కల్యాణ్‌ని తీసుకుని శవాన్ని చూడ్డానికి వెళ్ళాడు

* * * * * *

ఇంక ప్రశ్నించ వలసింది ఒక్కణ్ణే అతను మేనేజర్ శామ్యూల్ విజయ్ తిన్నగా అతని గదిలోకి ప్రవేశించాడు ఎప్పటిలాగే తలుపులు బార్లా తీసుకుని బెడ్‌మీద వెల్లకిలా పడుక్కుని వున్నాడు శామ్యూల్ విజయ్ అతన్ని లేపకుండా అతని కెదురుగా నించుని అతని మొహం వంక చూడసాగాడు రెండు నిమిషాల తర్వాత కళ్ళు చిట్లించినట్లు చేసి చూసాడు శామ్యూల్ ఎదురుగా నించున్న విజయ్ కనబడగానే అతని నిద్రంతా ఒక్కసారి ఎగిరిపోయింది ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు

మీరా? ఎందుకొచ్చారిక్కడికి? బొంగురు పోయిన గొంతుతో ప్రశ్నించాడు విజయ్‌ని అతని కళ్ళు ఎర్రగా చింత నిప్పుల్లా వున్నాయ్

ఒక దుర్వార్త చెబుదామని నిదానంగా అన్నాడు విజయ్

దుర్వార్తా? ఏమిటి? ఆశ్చర్యంగా అడిగాడు శామ్యూల్

ప్రకాష్‌కి చెప్పినట్టే అతనికీ చెప్పాడు విజయ్ ఆన్నంద్ మంఖవార ప్రకాష్‌లాగే ఆశ్చర్యబోయాడు శామ్యూల్ కూడ

ఈజిట్? ఎక్కడ? అంటూ మంచం మీంచి లేవబోయాడు

మీరలానే కూర్చోండి నాకు కొన్ని వివరాలు కావాలి అవి తెలుసుకున్నాక మీరెళ్ళి శవాన్ని చూడొచ్చు అంటూ అతని కెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు విజయ్

శామ్యూల్ ముఖం జేవురించింది

మిష్టర్ విజయ్ మీరిప్పుడు డ్యూటీలో లేరు ఇది మీ జ్యూరిస్‌డిక్షను కూడ కాదు అన్నాడు కోపంగా

విజయ్ చిన్నగా నవ్వేడు

మిష్టర్ శామ్యూల్ నాతో మర్షణకి దిగేముందు కొద్దిగా ఆలోచించుకోడం మంచిది కొద్దిక్షణాల్లో పోలీసులిక్కడికి వస్తారు అనుమానం మీద మిమ్మల్నిక్కడికిక్కడే అరెస్టు చేయించగలను

శామ్యూల్ ముఖం భయంతో బిగుసుకుపోయింది

అడగండి అన్నాడు నీరసంగా

రాత్రి మీరెంత వరకూ మేలుకుని వున్నారు

రూంకి వచ్చిన వెంటనే నిద్రపోయాను

అయితే ఆ సిగరెట్లన్నీ ఎప్పుడు తాగేరు బయట డస్ట్‌బిన్‌లో వున్న సిగరెట్లని ఉద్దేశిస్తూ అన్నాడు విజయ్

ఓ అవా పార్టీనించి వచ్చాక ఒక అరగంట వరకూ వరండాలో కూర్చుని కాల్చేను

విజయ్ డ్రస్సింగ్ టేబిల్ వంక చూసాడు దాని మీద కూడ ఒక ఎష్ట్రేవుంది అయితే అది చాలచిన్నది వెండితో చేసిన ఒక హాప్‌షూ మోడల్లో వుందది అందులో కూడ నాలుగైదు సిగరెట్ పీకలున్నాయి బహుశా అదినిండిపోగానే పైనున్న డస్ట్‌బిన్‌లో దాన్ని ఖాళీ చేస్తూ వుండి వుండవచ్చు శామ్యూల్

రాత్రి వర్షం పడ్డప్పుడు మీరు డాబా మీదకి కాని వెళ్ళారా? ఎష్ట్రే మీంచి దృష్టి మరలుస్తూ అడిగాడు విజయ్

నేనా వర్షమా అబ్బేలేదు శామ్యూల్ కొద్దిగా తడబడ్డాడు

విజయ్ మరేదో ప్రశ్నించబోయేంతలో దిగువున మోటారు వాహనాలు వచ్చిన శబ్దమయింది

పోలీసులూ హాస్పిటల్ స్టాఫూ వచ్చినట్టున్నారు పదండి దిగువకెళ్దాం అంటూ శామ్యూల్‌తో బాటు దిగువుకి వచ్చాడు విజయ్

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



డా ఒడొలిన్ స్మెకాల్ (58) చెకొస్లొవేకియాకి చెందినవారు హింది అంటే ఆయనకి ఆరో ప్రాణం లాంటిది తమ చిన్నప్పుడు అనుకోకుండా బగవత్‌గిత చెక్ అనువాదాన్ని చదవటం జరిగిందట దానితో ఆయనలో బారతీయ సంస్కృతిని పరిశోదించాలని హింది బాష నేర్చుకోవాలన్న ఆసక్తికి అంకురార్పణ జరిగింది ప్రాన్‌లోని చార్లెస్ విశ్వవిద్యాలయంనించి హిందిలో పట్టబద్రుడైన తొలివ్యక్తి ఆయన ప్రస్తుతం ఆయన అదే విశ్వవిద్యాలయంలో ఇండాలజీ శాఖాదిపతిగానే కాక ప్రముఖ హింది రచయితగా కవిగా అనువాదకుడిగా పేరుపొందారు ఇప్పటికి ఆయన 13 సార్లు బారతదేశాన్ని సందర్శించారు గత పదేళ్ళుగా ఆయన తయారు చేస్తున్న హింది-చెక్ చెక్- హింది నిఘంటువుని ఈ మద్యనే పూర్తి చేశారు త్వరలో దాని ముద్రణ బారత్ చెకొస్లొవేకియా దేశాలలో జరుగుతుంది హింది తమకి వృత్తే కాక వ్యావృత్తి కూడా అని ఆయన అన్నారు ఈయిన మార్గదర్శకత్వంలో చార్లెస్ విశ్వవిద్యాలయం నించి 40 మంది విద్యార్థులు హిందిలో పట్టబద్రులైనారు మున్షీప్రేమ్‌చంద్ ప్రఖ్యాత నవల గోదాన్‌తో సహా ఎన్నో గ్రంథాలని ఆయన చెక్ బాషలోకి అనువదించారు స్వయంగా హిందిలో ఎన్నో పద్యాలు రచించారు బారత స్వాతంత్ర్య సమరయోదులు ఋషుల గురించి ఆయన పద్యాలు రాసారు ఇటీవల బొంబాయిలో జరిగిన కాంగ్రెసు శతవార్షికోత్సవాలలో ఆయన సంపుటం అవిరామ్ కూడా చోటు చేసుకున్నది ఈయన బార్యకూడా బారతీయ జానపద గాథ స్పై అద్యయనం చేసిన వ్యక్తి తమ ఇంట్లో వీరు తరచు హింది మాట్లాడుకుంటారట పిల్లలకి ఇందిర అరుణ్ అని పేర్లు పెట్టుకున్నారు బాష ద్వారా బారత- చెక్ సంబందాల అబివృద్ధికి తమ జీవితమంతా కృషి చేస్తున్నందుకు గుర్తింపుగా ఈయనకి 1979లో బారత ప్రబుత్వం ప్రపంచ హింది అవార్డు ఇచ్చింది □

# వారఫలం

## 7-3-1986 శుక్రవారం మొదలు 13-3-1986 గురువారం వరకు

★ **మేషం** సాదు సజ్జన సాంగత్యం, వ్యాపారాన నూతనమార్గం అవలంబించుటకు వ్యవసాయ సంబంద పలసాయం అందుకొనుటకు అప్పులుంటే తీర్చివేయుటకు పరివారాన్ని అదుపులో ఉంచుకొనుటకు అనువైన కాలం స్త్రీలకు సుఖశాంతులు నూతన వృత్తి చేకూరుటకు అవకాశాలుంటాయి

★ **వృషభం** ఆ యీ వ్యవహారాలలో తలదూర్చి యిబ్బందుల పాలవుతారు గమనించి మెలగండి కాలంకానినాడు జాగ్రత్తగా సంచరించుట అవసరంగదా! స్థితిగతులయందు కొంత మెరుగు కనిపించినా పెద్దగా మేలుచెప్ప వీలులేదు స్త్రీలకు వృత్తియందు వికాసం

★ **మిధునం** గత కొన్ని వారాలుగా జరగని వ్యవహారాలు నెరవేరుటకు లాబప్రదాయకాలు అగుటకు ఆక్షేపణలేదు ఏవేవో యింకా మీకు కూడిరాలేదని యిబ్బంది పడతారు ఆవేదన పడతారు అనవసరం కలసి రావలసిన కాలానికి అన్నీ కూడివస్తాయి ఆ సమయం ఆసన్నమైంది స్త్రీలకు స్థితిగతులందు వృద్ధి దనాదాయం

★ **కర్కాటకం** రాజకీయవాదులకు అనువైన సమయంగాదు చేసిన ప్రయత్నాలు సిద్ధిస్తాయి అనే నమ్మకంలేదు వృత్తియందు వికాసం పెద్దగా చెప్పవీలులేదు సంఘసేవయందు నిమగ్నులవుతారు. బంధుమిత్రులు మీ సహాయం కొరకు వెంటబడతారు స్త్రీలకు నూత్న వృత్తిని అవలంబించుట కొందరకు దనలబ్ధి కొందరకు

★ **సింహం** ఒకటి రెండు రోజులు పనులు జరుగకనో చేతినిండా డబ్బుచిక్కకనో యిబ్బందిపడుతారు స్థిరచరాస్తులు గూర్చిన వాగ్వాదాలు బంధువర్గంతో ఉండగలవని చెప్పవచ్చు ఇంతకు పూర్వము వివాదపడినవారు దాపునకు రావటంతో సంతోషం అతిశయిస్తుంది కొందరు క్రొత్త వాహన సంపాదన కొరకు తాపత్రయపడుచున్నారుగా! ఇకనేం సిద్ధంగా ఉంటుంది అందుకోండి స్త్రీలకు ఆదాయానికి లోటులేదు

★ **కన్య** ఏనాడో జరగవలసిన శుబ కార్యానికి ఈనాడు నాంది పడుతుంది బూవిషయంగా యిటీవల సంబవించిన వివాదం పరిష్కారం అయ్యే మార్గం యిప్పట్లోలేదు రాజకియంగా శ్రమవృదా అని కొందరు గ్రహింప గలుగుతారు స్త్రీలకు ఆశించిన విదంగా కొందరకు ప్రమోషన్ లబ్యం కొందరకు సాహితీ మార్గానపెంపు

★ **తుల** ఎవరిని నమ్మాలో ఎవరిని కూడదో తెలిసికోలేక వారమంతా తికమక పడుతారు ప్రజారంగాన మాత్రం గౌరవం చేకూరుతుంది అదికారాన్ని క్రమంగా వృద్ధిచేసుకోగల అవకాశాలున్నాయి గమనించండి స్త్రీలకు అవసరాలకు తగినంత డబ్బు చిక్కుతుంది

★ **వృశ్చికం** వస్తు సేకరణకు అవకాశం ప్రయాణ మూలకంగా లాబసంపాదన వ్యాపారాన లాబం సంపాదించటం నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడటం నిశ్చయం స్త్రీలకు వృత్తియందు మెరుగు దనలబ్ధికి అవకాశం

★ **ధనుస్సు** ఏ వ్యవహారం ఎలా పోయినా మనకేం? అని ఊరుకుండరాదు నాలుగువిధాలా గమనించి మెలగటం అవసరం చాలామందికి చిన్నవో పెద్దవో ప్రయాణాలు చెప్పదగిన సమయం వృత్తియందు వికాసమున్నది స్త్రీలకు అనుకొన్న విదంగా శుబకార్యాలు కలసిరావని గ్రహింప గలుగుతారు

★ **మకరం** ప్రజారంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది కళాసాహిత్య రంగాలలో కొందరకు సదవకాశాలు లభ్యం కాగలవు నూతనోత్సాహంతో కొందరు వ్యాపార సంబందంగా శ్రమింపనున్నారు దూరప్రాంతాల నుండి నూతన వార్తలందగలవు స్త్రీలకు కొందరకు వృత్తియందు వికాశం కొందరకు సాహస కార్యాలలో మేలు సంబవం

★ **కుంభం** విదేశీ ప్రయాణం కొందరకు చెప్పుటకు అనువైన వారం ప్రముఖులనో దనవంతులనో ముఖ్యులనో కలసికోనున్నారు ఏవో అతిముఖ్యమైన పనులు సాదించుకోనున్నారు ఏమయినా స్తోత్ర పారకులను దగ్గర చేర్చకండి స్త్రీలకు ఉద్యోగరీత్యా మేలుంది దనలబ్ధి

★ **మీనం**. పోయిన వస్తువులు సమకూర్చుకో గలుగుతారు మతిమరపు అధికం కావచ్చు కొందరకు కొందరకు ఉద్రేకం సంబవించే అవకాశముంటుంది శ్రద్ధాసక్తులు అన్ని వ్యవహారాలలో అవసరమని గ్రహించాలి బంధు ద్వేషానికి కొందరు గురికాగలరేమో గ్రహించండి స్త్రీలకు బంధువర్గమున ఆదరణ శుబ కార్య ప్రస్తావనలకు అవకాశం గలవారం గ్రహించాలి

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

రమణయ్యను చూసి చాలా రోజులయింది నాకూ అతనికున్న అనుబంధం చాలా స్వల్పమే అయినా అతనితోటి మైత్రీబందాని కది చాలదా? ఈ కథ చదివే పాఠకులకి మొదట్లోనే నేను క్షమాపణ చెప్పుకుంటున్నా ఎందుకంటే రమణయ్యను ఈ కథ ద్వారా విలన్‌ని చేశానని పొరబడి అనుకోకండని మరిమరి మనవిలాంటిదే చెప్పుకుంటున్నా సరి రమణయ్యకు నాకు ఎక్కడ పరిచయమైందో చెబుతా

ఆ రోజు స్కూల్లో నేను అయిదవ తరగతి కనుకుంటా లెక్కలు చెప్పుకుంటున్నా సమయం మద్యాన్నం మొదటి పీరియడు పిల్లలు హడావిడిగా లెక్క లేస్తున్నారు లెక్కలు చెప్పడంలో నాకు మొదట్నుండీ ఇష్టం అన్ని సబ్జక్టులకన్నా లెక్కలు చెప్పటమంటే నాకు సరదా లేదా ఇంటరెస్టు – మీరేదైనా అనుకోవచ్చు నా అవదానం పిల్లల అటెన్షన్ అంతా మేథ్స్‌పైన్నే వుంది

ఆ సమయంలో పాఠశాల బయట

సార్! సార్! గావుకేకలాంటి శబ్దం వినిపించింది – చేతిలో చాక్‌పీసు మరో చేతిలో డస్టర్‌తో బయటికి తొంగి చూశాను

మా అబ్బాయి అయిదవ తరగతి అదేనయ్యా వీరిగాడు! తెలవదా! ఆడినాన్న నేనేనయ్యా! రమణయ్య అంటూరు

సరి రమణయ్య నువ్వే ఎంటి సంగతి?

మావాడు మద్యాన్నం వచ్చాడా? మీరు ఎయంపెట్టడం లేదా? తెల్లారి వచ్చినవాణ్ని మద్యాన్నం వచ్చాడా? లేడా? అని చూడొద్దా? అహం బయంపెట్టొద్దా?

ప్రశ్నల వర్షంపైన నా బుద్ధి స్వాదినం తప్పింది అయిదవ తరగతి బిన్నములపైన బిన్నముల కూడిక తీసి వేతలపైన కేంద్రీకరించిన నా అవదానాన్ని రమణయ్య రాకతో వీరిగాడిచోటు వాడి ఉనికిపైన నాకేకాదు మా తరగతి పిల్ల లందరి దృష్టి ఆక్రమించుకొంది

వీరిగాడా సార్ వాడు బావిలో దూకతా వుండాడుసార్! ఓ పిల్లవాడు లేచి రపీమని చెప్పాడు

సార్ సార్ వాడు బొంగరాలు ఆడతా వుండాడుసార్! మరో గొంతు

ఉడతలు పడతావుండే ఎరుకల వాళ్ళ దగ్గర చెరువుకాడ వుండాడురా వీరిగాడు ఇంకొకడు చెప్పసాగేడు

చింతకాయలకు చింత చెట్టు ఎక్కాడు అప్పుడే బడికి వస్తున్న ఓ అబ్బాయి ఉవాచ!

నువ్వెక్కడికి వెళ్లావురా బడుద్దాయ్ వాడి వీపు సాపుచేస ఇద్దరి పిల్లల్ని పంపి వీరిగాణ్ని లాక్కుని రమ్మన్నాను రాచబటుల్లాంటి ఇద్దరు పరువెత్తారు ఆలస్యంగా వచ్చిన అబ్బాయిని చూస

వీడు వాడు కలిసే చింతచెట్లు ఎక్కతా వుండారు సార్ రోజూ వీళ్లిద్దరూ ఎగరతా చెట్లెక్కుతా వుంటారు సార్! చాడీలు చెప్పటంలో నెంబరు వన్‌లాంటి అబ్బాయి తరచూ లేవసాగేడు వాణ్ని అదలించి

ఎంరా! నువ్వెందుకు ఆలస్యంగా వచ్చావురా వీరిగాడితో నీకు స్నేహమా?

నేను సంగటి ఎత్తుకుని తాటిమాను గుంటకాడికి వెళ్లి మా యబ్బకు అన్నం వేసి వస్తున్నా సత్తెంగా నాకేమి తెలవదు సరస్వతి సాచ్చిగా సార్

రమణయ్య ఇదంతా వింటూ నాకేసే చూస్తూ

ఇదండీ వీళ్లరావిడి... మీరు ఎయంపెట్టొద్దా? అసలు ఈళ్లకు బయం బక్తి లేకపోయె ఎట్లా సదవతారు'

రమణయ్య చెప్పుకుపోసాగేడు నాకు రమణయ్య పైన వీరిగాడిపైన చెప్పరానంత కోపం వచ్చింది బయం బక్తిని టీచర్ల వద్ద పుష్కలంగా వుందంటున్నాడు రమణయ్య పూర్వకాలం మాటేమొ కాని ప్రస్తుతం మా వద్ద లేవు తలిదండ్రుల ముద్దూ ముచ్చట్లు గ్రామ రాజకీయాలు ఎల్లల అతిమేదావి తనం ఇవన్ని చప్పున చల్లార్చి వేస్తున్నాయి ఇవన్ని రమణయ్యకు క్రమంగా చెప్పసాగేను అతగాడు

అది నిజమే లెండి మీరు తడితే కొడితే సఁయమని మి మిమీః పస్తావుంటే మీరేం చేస్తారు' అకాడికి ఈ ... కొచ్చిన (టీచర్సు) వాళ్లల్లో మీరే



కాస్తనయం అకాడికి మిమ్మల్ని చూస్తేనే పిల్లకాయలు ఉచ్చలు పోసుకుంటారు అయినా మా వాడిని బయపెట్టండి మేము మిమ్మల్ని మతించేది లేదు వాళ్లమ్మను చూస్తే లెక్క లేదు వాడికి

ఇంతలో వీరిగాడు రానే వచ్చాడు ఎడుస్తూ వచ్చాడు ఈడ్వబడుతూ వచ్చాడు వాణ్ని లాక్కొని వచ్చిన వాళ్లని రక్కుతూ వచ్చాడు వీరిగాణ్ని చూడటంతోటే నాకు కోపం వచ్చింది

ఎక్కడికి వెళ్లావురా? మెల్లగా అడిగాను బదులివ్వడే తలవంచుకున్నవాడు పై కెత్తడే! బదులివ్వడు బెత్తం తీసి ఒకటిచ్చాను అంతే ఊరెత్తుకుని పోయేటట్టు పొలోమని ఏడ్వసాగేడు రమణయ్య వాణ్ని పొదువు కున్నాడు

అణ్ని కొట్టొద్దండి సార్ రమణయ్య కళ్లల్లో అశ్రుదారలు చూశాను

ఎం? ఎందుకని?

కొట్టొద్దండి సార్

బయం బక్తి లేదన్నారు కొడితే వాడేడిస్తే నువ్వేడుస్తున్నావ్ ఏంటిది రమణయ్యా

సార్ లేక లేక పుట్టాడుసార్ నాకు ఆడొక్కడే మాకులాని కంతా ఎకైకసంతు ఈ దెబ్బ సూత్తే ఈ వాతసూత్తే అళ్లమ్మ తిండీ తినదు నీళ్లూ తాగదు అంత బెమదానికి ఈడిపైన

అలా మురిపంగా ముద్దుగా మీరు పెంచి బయం పెట్టమంటారు తప్పుచేస్తే తిట్టడం మెల్లగా కొట్టక పోతే బయం ఎలావస్తుంది?

వీరిగాడు ఏడుస్తూనే వున్నాడు రమణయ్య వీరిగాణ్ని ఎత్తుకున్నాడు ఏడవొద్దు అని బుజ్జగిస్తున్నాడు నేను ఇంకేమి చేయలేక వాచ్‌కేసి ఇంటర్వల్ బెల్ కొట్టమన్నాను పిల్లలంతా బడి వదలి వెళ్లారు రమణయ్యను బెంచీమీద కూర్చోమన్నాను ఇంతవరకు వీరిగాడి మీద కోపంగా వున్న రమణయ్య ఇప్పుడు నా మీద కోపంగా వున్నా నీ నాకు తెలుసు కారణం కొడుకుని కొట్టానని!

బయం పెట్టమంటే కొట్టడమేనా

# త్రిభుజం

బయంపెట్టండి తిట్టండి అంతేకాని కొట్టేస్తారా? మావాడిలా ఏడ్చిందేలేదు సరైన టీచరండీ మీరు? ఒరేయ్ ఒరేయ్ ఏడవొద్దురా వీరిగా ఏడవుకా మా అమ్మవికదూ మానాయనవి కదూ! చ్ చ్

మాతృ ప్రేమ పితృ ప్రేమ వుండాల్సిందే ఒకే ఒక్క చిన్న దెబ్బకే బెంబేలెత్తి పోవడమా? ఇదేమన్నా బావుంతా?

వీరిగాడు తండ్రి మరుగున అతగాడి మాటలకు ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు

మావాడి పుస్తకాల సంచి ఇవ్వండి ఆ బ్యాగ్ తీసుకున్నాడు రమణయ్య

వస్తాను సార్

వెళ్లిరా

వీరిగాణ్ని పిలుచుకుని వెళుతున్నా

వీరిగాణ్ని!

వీరిగాడు ఇంకరాడు బడికి ఆడు ఎన్ని తప్పులు సేసినా మేం అణ్ని ఇలా కొట్టామా! లేదు మీ సేతులు పడిపోను పిల్లాణ్ని కొడతారా రారా ఈ సదువూవద్దు సట్టుబండలూ వద్దు కయ్యవుంది కాలవవుంది గొడ్డూ గోదావుంది కామందుల కొట్టమూవుంది రమణయ్య మాటలు అవి!

అంటూ రమణయ్య వీరిగాణ్ణి అంటే అయిదవ తరగతిలో చదివే కుర్రవాణ్ని తీసుకుని వెళ్ళాడు ఇక బడికి పంపడు దండించ మన్నవాడు తేలిగ్గా మందలించడానికని బెత్తంతో కొడితే కసురుకుని వీరిగాడి బవిష్యత్తును కాలరాచాడు

కథ ఇంతటిదో ఆగిపోలేదు నేను రమణయ్య కన్పించినప్పుడల్లా వీరిగాణ్ని స్కూలుకి పంపమని శతపోరాడాను ససేమిరా విన్లేదు నా రోదన తప్పించు కోడానికని తన పెళ్లాం మంగితో మాటాడమన్నాడు ఓదినం మంగిని కలిశాను వీరిగాడు బాగా చదువుతున్నాడు వాడి చదువుని వాడి తెలివి తేటల్ని గొప్పగా జతచేసి చెప్పినా ఆవిడవినా

సర్లెండి మీరెంతో మీ చేతివాటమెంతో మా అయన చెప్పారు అయినా పిల్లాణ్ని కొడతారా?

కొట్టేనా? నేను వాణ్ని ఎప్పుడైనా కొట్టేనా? రమణయ్య వచ్చి భయం పెట్టమంటే పూరక అలా కొట్టేను అదినం అంతే ఏఁరా వీరిగా కొట్టేనా?

అరోజు కొట్టలేదా సార్!

అరోజు సంగతి వదలేయ్ మునుపు కొట్టేనా?

లేదు

అంతేరా ఎప్పుడూ కొట్టలేదు మంగి! ఇప్పుడెందు కిలా వచ్చానంటే మీ వాడలో వాడు మంచి మార్కులు తెచ్చేవాడు

సారూ ఇది వినండి సతాయించకండి మావాడు మీ పలుగూటానికి ఇంక రాడు నేను పంపినా మా ఇంటాయన పంపడు మా వీరిగాడు వస్తాడేమొ కనుక్కోండి వాడొస్తే పిలుచుకుని వెళ్లండి నా అబ్బెంతరం లేదు

ఏంరా వీరిగా రారా ఇంకెప్పుడూ కొట్టను బడికి రారా కథలు పాటలు చెప్పుకోవచ్చు ఎంచంక్కా ఆటలు ఆడొచ్చు మంచివాడివికదా! బాగా చదివే వాడివి కదరా నామాట వినరా?

నేను రానుసార్ అంటు వీరిగాడు కొట్టానికి కట్టిన అవుదూడను పలుపునుండి తీసుకుని పొలం వైపు వెళ్లాడు గుడిసె తలుపు మూసి బీగం వేసి తట్ట నెత్తుకుని చేను కు బయల్దేరింది నేను స్కూలుకి వచ్చేశాను ఇంకా మొదటి గంట కొట్టడానికి అరగంటవుంది ఆలోచిస్తూ కూర్చున్నా తల్లి దండ్రి గురువు– ముగ్గురూ పిల్లవాడి జీవితాన్ని తీర్చిదిద్దేవాళ్లు ఇందులో వీరిగాడి చదువు నిలిచి పోవడానికి ముఖ్య కారణం విలన్ లాంటి రమణయ్యే? నేనా? అన్నం పెట్టి బుజ్జగించి బడికి పంపాల్సిన తల్లా? ఎవరు? ఎవరు?? ఎవరు??? వీరిగాడు బడికి రాడు చదవడు అంతే □




Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna

Phones Business 61247, 61248, Editorial 75667







భారత స్త్రీల మంగళ చిహ్నం

# ఐటెక్స్

## మాట్ ఫినిష్ తిలకం




**ఐటెక్స్** 48 సంవత్సరములుగ మీ
నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600033

# హైదరాబాదు నోట్‌బుక్

## వరంగల్లు సదస్సుకు హైదరాబాద్ ప్రతినిధులు –

వరంగల్లులో కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం తెలుగు సాహిత్య పరిశోధన విధాన ప్రణాళికా పద్ధతులను రూపొందించడానికి ఫిబ్రవరి 7 8 9 తేదీలలో కాకతీయ విశ్వవిద్యాలయం ఆవరణలో జరిగిన జాతీయ సదస్సులో రాష్ట్రంలోని తక్కిన విశ్వవిద్యాలయాల రాష్ట్రేతర విశ్వవిద్యాలయాల ప్రతినిధులతో పాటు జంటనగరాలలోని హైదరాబాద్ ఉస్మానియా సార్వత్రిక తెలుగు విశ్వవిద్యాలయాల ప్రతినిధులు పాల్గొన్నారు 7వ తేదీన ఉదయం సదస్సును సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ సి నారాయణరెడ్డి ప్రారంభించారు ఈ ప్రారంభోత్సవానికి కాకతీయ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య టి వాసుదేవ్ అధ్యక్షత వహించారు ఆచార్య డాక్టర్ దివాకర్ల వెంకటావధాని ప్రారంభోపన్యాసం చేశారు తర్వాత సదస్సు చర్చలు ప్రారంభించింది 7వ తేదీ మధ్యాహ్నం జరిగిన మొదటి సదస్సు తెలుగు భాషా సాహిత్య పరిశోధన చారిత్రక సింహావలోకనం అనే విషయంపై చర్చ జరిగింది దీనికి ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు విభాగం అధ్యక్షులు ఆచార్య డాక్టర్ ఎస్వీ జోగారావు అధ్యక్షత వహించారు శ్రీ తిరుమల రామచంద్ర విశ్వవిద్యాలయాలు నెలకొనక ముందు నెలకొన్న తర్వాత విశ్వవిద్యాలయాలకు వెలిగా జరిగిన తెలుగు భాషా సాహిత్య పరిశోధన గురించి ప్రసంగ వ్యాసం చదివారు ఆచార్య పి ఎస్ సుబ్రహ్మణ్యం (అణ్ణామలై విశ్వవిద్యాలయం) తెలుగు భాషలో జరిగిన పరిశోధనను వివరించారు ఆనాటి సాయంకాలం జరిగిన సదస్సులో విశ్వవిద్యాలయాలలో తెలుగు భాషా సాహిత్య పరిశోధనపై చర్చలు జరిగాయి ఆచార్య జి వి సుబ్రహ్మణ్యం (హైదరాబాద్) అధ్యక్షత వహించారు డాక్టర్లు ది చిన్ని కృష్ణయ్య (మద్రాసు) గంగప్ప (నాగార్జున) జి నాగయ్య (వేంకటేశ్వర) శ్రీమతి మలయవాసిని (ఆంధ్ర) చంద్రశేఖరరెడ్డి (శ్రీకృష్ణదేవరాయ) చేకూరి రామారావు (ఉస్మానియా) తంగిరాల వెంకట సుబ్బారావు (బెంగళూరు) ఆర్వియస్ సుందరం(మైసూరు) బి వి సూర్యనారాయణ (కాశీ) శ్రీమతి సుశీల (ఢిల్లీ) రామనరసింహం (హైదరాబాద్) కోవెల సంపత్కుమారాచార్య (కాకతీయ) తమ తమ విశ్వ విద్యాలయాలలో జరిగిన తెలుగు భాషా వాఙ్మయ పరిశోధన సమీక్షిస్తూ ప్రసంగ వ్యాసం చదివారు 8వ తేదీ ఉదయం జరిగిన సదస్సు సిద్ధాంత వ్యాస (థీసిస్) విషయం పరిశోధన విషయ సేకరణ పద్ధతులు అనే విషయం చర్చించింది డాక్టర్ నాయని కృష్ణకుమారి (ఉస్మానియా) అధ్యక్షత వహించారు ఆచార్యులు వేల్చేరు నారాయణరావు (విస్కాన్సిన్) కొర్లపాటి శ్రీరామమూర్తి (ఆంధ్ర) తుమ్మపూడి కోటేశ్వరరావు (శ్రీకృష్ణదేవరాయ) కొలకలూరి ఇనాక్ (శ్రీకృష్ణదేవరాయ) మాదిరాజు రంగారావు (కాకతీయ) తమ అభిప్రాయాలు ప్రకటించారు ఆనాటి మధ్యాహ్నం జరిగిన సదస్సు సిద్ధాంత వ్యాస విషయములు వివిధ శాస్త్రాంశాల పరిమితులు అనే విషయమై చర్చించింది ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి (సార్వత్రిక విశ్వవిద్యాలయం) అధ్యక్షత వహించారు ఆచార్యులు కేతవరపు రామకోటి శాస్త్రి (కాకతీయ) కోవెల సుప్రసన్నాచార్య (కాకతీయ) అబ్బూరి గోపాలకృష్ణ (ఆంధ్ర) జి వి రత్నం (కాకతీయ) తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు ఆనాటి అపరాహ్ణంలో సిద్ధాంత వ్యాస విషయం తులనాత్మక పరిశోధన అనే విషయమై చర్చించిన సదస్సుకు ఆచార్య బి వి సూర్యనారాయణ (కాశీ విశ్వవిద్యాలయం) అధ్యక్షత వహించారు ఆచార్యులు చల్లా రాధాకృష్ణ శర్మ (మదురై) బి బీమ్‌సేన్ నిర్మల్ (ఉస్మానియా) పేర్వారం జగన్నాథం (కాకతీయ) ఆర్వియస్ సుందరం (మైసూరు) గిరిప్రసాద్ (మదురై) వంతరాం రామకృష్ణరావు (ఆంధ్ర) ప్రసంగ వ్యాసాలు చదివారు ఆనాటిసాయంకాలం జరిగిన సదస్సుకు ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం (నాగార్జున) అధ్యక్షత వహించారు విషయం సిద్ధాంత వ్యాస నిర్మాణం డాక్టర్లు జి వి సుబ్రమణ్యం (హైదరాబాద్) హెచ్ ఎస్ బ్రహ్మానంద (శ్రీకృష్ణ దేవరాయ) శ్రీమతి కాత్యాయని (కాకతీయ) ఏ భూమయ్య (కాకతీయ) శ్రీమతి పి జ్యోతి (కాకతీయ) కె యాదగిరి (కాకతీయ) ప్రసంగ వ్యాసాలు చదివారు 9వ తేదీ ఉదయం చివరి 7వ సదస్సు సిద్ధాంత వ్యాస రచనా రీతిపై చర్చలు జరిపింది ఆచార్య గంధం అప్పారావు (మద్రాసు) అధ్యక్షత వహించారు ఆచార్యులు శలాక రఘునాథశర్మ (శ్రీకృష్ణ దేవరాయ) చేకూరి రామారావు (ఉస్మానియా) ఎ వి నరసింహారెడ్డి (శ్రీ వేంకటేశ్వర) సంపత్కుమారాచార్య (కాకతీయ) ప్రసంగ వ్యాసాలు చదివారు మధ్యాహ్నం కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం పరిశోధన విధానంపై చర్చ జరిగింది తర్వాత జరిగిన సమాపనోత్సవానికి కాకతీయ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య టి వాసుదేవ్ అధ్యక్షత వహించారు ముఖ్య అతిథిగా రావలసిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప రాలేకపోయినందున ఆచార్య గంధం అప్పారావు (మద్రాసు) ముఖ్య అతిథిగా వ్యవహరించారు ఈ సదస్సు రెండు ముఖ్యమైన తీర్మానాలు చేసింది తెలుగు భాషా పరిశోధన సమితి నెలకొల్పాలని పరిశోధన కోసం ఒక పత్రిక ప్రారంభించాలని ఈ రెండు తీర్మానాలు సమితికి కన్వీనరు కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం అధ్యక్షులు ఆచార్య కేతవరపు రామకోటి శాస్త్రి సలహాదార్లు సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ సి నారాయణరెడ్డి అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప పరిశోధన కోసం ప్రచురించే పత్రిక కాకతీయ విశ్వవిద్యాలయం నుండే వెలువడుతుంది సమాపనోత్సవంలో ఆచార్య వాసుదేవ్ విద్యార్థులకు ఉపయోగించే ఏ పనికైనా కాకతీయ విశ్వవిద్యాలయం శాయశక్తులా సహాయపడుతుందని హామీ యిచ్చారు సదస్సు మూడు రోజులూ సభ్యంగా సవ్యంగా సముదాత్తంగా జరిగింది చర్చలలో దూషణ తిరస్కారాలు వాయిలు కూడ లేవు ప్రతినిధులకు వసతి భోజన సదుపాయాలు చక్కగా చేశారు నిర్వాహకులు సదస్సును జయప్రదంగా నిర్వహించినందుకు కాకతీయ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య టి వాసుదేవ్‌ను సదస్సు నిర్దేశకులు ఆచార్య రామకోటి శాస్త్రిని సహ నిర్దేశకులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులను అభినందిస్తున్నాను చర్చలు సభ్యంగా కొనసాగించిన ఆచార్యులందరినీ అభినందిస్తున్నాను ఈ సదస్సు చర్చలలో చాల కొత్త విషయాలు తెలిశాయి నాకు చాల నచ్చింది మదురై విశ్వవిద్యాలయ ప్రతినిధి డాక్టర్ గిరిప్రసాద్ దండకచ్ఛందస్సును గురించి చెప్పినది ఇది సంస్కృత దండకం కన్నా భిన్నం సంస్కృతంలో తొలి దండకం శ్యామలా దండకం 12వ శతాబ్ది తమిళులో దీనికి తాండకచ్ఛందం అన్నారు దీనిని తొలిసారిగా వాడినవారు తుమంగైయాళ్వారు 7వ శతాబ్ది తర్వాత శైవ మహాభక్త కవి అప్పర్ వాడాడు

## ఉపశ్రుతి –

కాకతీయ విశ్వవిద్యాలయంలో ఫిబ్రవరి 7 8 9 తేదీలలో తెలుగు భాషా సాహిత్య పరిశోధనపై జరిగిన సదస్సుకు మూడు రోజులూ పట్టుగా ఒక ఖాకి డ్రెస్సు వేసుకున్న వ్యక్తి హాజరవుతూండటం చూచాను చూస్తే చదువుకున్నవాడుగా లేడు 'ఎవరయ్యా నీవు' అని అడిగాను చివరి రోజున అదేమిటి సార్? మిమ్మల్ని మీటింగు హాలుకు బసకు భోజనాల శామియానాకు చేరవేస్తున్న వ్యాను డ్రైవరు కందికొండ వెంకటయ్యను అన్నాడు అంటూనే మీటింగ్ బలే బాగా జరిగింది సార్ అన్నాడు నేను ఆశ్చర్యపోయి ఏమర్థమయింది నీకు? అనడగాను కొన్ని సంగతులు చెప్పాడు నాకు మరింత ఆశ్చర్యమయింది ఏం చదివావు? అని అడిగాను ఎనిమిదో క్లాసు అన్నాడు సదస్సు నిజంగా సార్థకమయిందోయ్ నీకు కూడా అర్థమయిందంటే ఉపన్యాసాలలో స్పష్టత సరళత విషయ విశదత ఉన్నాయనేగా' అన్నాను ఆ పెద్ద మాటలు నాకు తెలవు సార్ నాకు చాల విషయాలు తెలిశాయి అన్నాడు వెంకటయ్య ఏ సభకైనా (ప్రజాస్వామ్య వ్యవస్థలో) ఇలాటి సర్టిఫికెట్టు చాలు అని అనుకొన్నాను

-తిరుమల రామచంద్ర

# పుష్కలంగా చిల్లర....

* రవీంద్ర *




















సీక్రెట్ ఏజంట్
విక్రమ్
8




విక్రమ్ కళ్లకి గంతలు కట్టి తీసుకు వెళ్తారు –
29/8




గోడ మీద ఉన్న మీటని మార్క్ నొక్కగానే ఒక తలుపు తెరుచుకుంటుంది...
లోపలికి వెళ్లు!




విక్రమ్ లోపలికి వెళ్లగానే ఆ తలుపు మూసుకుంటుంది.




ఎవరది?




నా పేరు విక్రమ్. భారత గూఢచారి సంస్థ ఏజంట్ని.
ఓహ్!




నేను ఇంటర్‌పోల్ ఏజంట్ మార్టిన్‌ని.
నువ్వెలా పట్టుబడ్డావు?
83.




నేను ఓ వారం కిందటే ఇక్కడికి ఒంటరిగా వచ్చాను. రికార్డు గదిలో సాక్ష్యాధారాల కోసం వెతుకుతూ పట్టుబడి పోయాను.




తప్పించుకునే ప్రయత్నం చెయ్యలేదా?
దీనికి నువ్వొచ్చిన మార్గం ఒక్కటే దారి. ఆ తలుపు కరెంటుతో పని చేస్తుంది.




నువ్వనేది ఇదేనా?
అవును. స్విచ్ తీసేస్తే తలుపు తెరుచుకుంటుంది. అయితే అది బయటి వైపు ఉన్నది.






నాకో ఆలోచన వచ్చింది. నీ దగ్గర నాణెం ఏదైనా ఉందా?
ఉండవచ్చు. చూస్తాను.
(ఇంకా ఉంది)













# అమృతాంజన్‌కే తెలుసు ఒంటి నొప్పులు మరియు బెణుకుల బాధ

మృదువైన మూలపదార్థము వల్ల<br>ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల<br>మందు శక్తికి రక్షణ




## అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని<br>శీఘ్ర నివారిణిని నమ్మండి





1984 ఒలింపిక్స్ క్రీడలలో<br>పాల్గొన్న భారత క్రీడాకారులకు<br>అధికారపూర్వకంగా పెయిన్ బామ్<br>సరఫరా చేసినవారు

OBM 8777 TG